# జమీన్ రైతు

Regd. No. H. 39. 18
స్థాపితం 1930
సంపుటి 67 సంచిక 29
18–7–1986
శుక్రవారం
12 పేజీలు రూపాయి


# ఎన్టీఆర్ మెడలువంచి పంచాయితీ బిల్లు తారుమారుచేశారు ఎమ్మెల్యేలు!

మా హైదరాబాదు విలేఖరి

అన్న అనుకున్నంత పనీ అయ్యింది చివరకు! పంచాయతీ మండలాల బిల్లు మొత్తానికి బోల్తా కొట్టింది. ముసాయిదా దశలోనే పూర్తిచేసుకొని అసెంబ్లీ ఆమోదం కోసం నిరీక్షిస్తున్న సమయంలో దానిని ఇట్లా తారుమారు చేయవలసి వస్తుందని ఎన్టీఆర్ కూడా ఊహించలేదు. కాని తెలుగుదేశం శాసనసభాపార్టీలోని 'విప్లవకారు' లన్న మెడ వంచింది; బిల్లును తారుమారుచేయించింది.

తనముందు అణకువగా బుద్ధిగా మసలుకునే తన పార్టీ ఎమ్మెల్యేలే, తన నిర్ణయాలనిట్లా వ్యతిరేకిస్తారని, ప్రతిఘటిస్తారని ఎన్టీఆర్ ఊహించివుండరు. ఆ ధైర్యంతోనే ఆయన పేరుకు ఒక మంత్రివర్గ ఉపసంఘాన్ని నియమింపజేసి, తన అభిప్రాయాలకనుగుణంగా వారిచేత బిల్లు రూపొందింపజేసి, అసెంబ్లీ ఆమోదానికి చిత్తుప్రతిని ప్రింటింగ్‌కూడా చేయించి పెట్టారు. దానిప్రకారం పంచాయితీ వ్యవస్థనుంచి సమితులతోపాటు జిల్లాపరిషత్‌లుకూడా నిష్క్రమిస్తాయి. మండలాధ్యక్షులు ప్లానింగ్‌బోర్డులలో సభ్యులవుతారు. ఎమ్మెల్యేలతో సమానంగా వారికందులో అధికారముంటుంది.

ఈ సమభాగస్వామ్యాన్ని తెలుగుదేశం ఎమ్మెల్యేలు సహించలేకపోయారు; ప్రతిఘటించారు. నిజానికి ప్రభుత్వం చేసే ప్రధాన విధాన నిర్ణయాలలోకూడా తమమాటకు విలువలేకుండా పోతుందన్న అసంతృప్తి తెలుగుదేశం ఎమ్మెల్యేలలో ఎప్పటినుంచో వుంది. ఈసారిమాత్రం వారు దాన్ని మనసులో దాచుకోలేక బాహాటంగా వెళ్ళగక్కడంతో ముఖ్యమంత్రికి వణుకుపుట్టింది. రిక్విజిషన్ సమావేశానికి ఎమ్మెల్యేలు సంతకాలు సేకరిస్తున్నారని తెలియగానే, ఆయన దాన్ని ఏర్పాటు చేసేశారు. కమ్మ కాకలో వున్నప్పుడే సమ్మెటదెబ్బలు పడాలనేది సామెతకదా- కుర్ర ఎమ్మెల్యేలందరూ [illegible] సందని దబాయించి మాట్లాడేశారు.

ఈ 'విప్లవకారుల'లో ఆనం రామనారాయణరెడ్డికూడా ఉండడం విశేషం. అందరికంటే జోరుగాపోయాడట ఆయన. ముష్టి 30 వేలఓట్లతో ఎన్నికైన మండలాధ్యక్షులను తమతో సరిపోల్చిపెట్టడం అన్యాయమని, జీపు, సిబ్బంది ఎగ్జిక్యూటివ్ అధికారాలు కల్గినవారు దర్పంగా సమావేశానికివస్తే, తాము నడిచిరావలసి వస్తుందని, జనం తమనుమరిచిపోతారని, అందువల్ల ప్లానింగ్‌బోర్డులకు వారిని దూరంగాపెట్టి, జిల్లాపరిషత్‌లు

–కొరవ 7 వ పేజీలో

- వట్టి సంతకాలకే బెదరిపోయారు!
- బిల్లు మార్పు జానారెడ్డి గెలుపే!
- ఆనం రాంనారాయణ రెడ్డికూడా అన్నను నిలదీశాడట!
- ప్రణాళికా మండలి అధ్యక్షత నుంచి రెవిన్యూమంత్రి తొలగింపబడతాడా?

# రిజర్వేషన్ల ఉద్యమం వెనుక పెద్దల్లుడి అనుచరులు?

రిజర్వేషన్ల ఉద్యమం మెల్లగా రాజుకుంటోంది. వెనుకబడిన తరగతులకు ప్రస్తుతమిచ్చిన రిజర్వేషన్లు కొనసాగితే తమకు భవిష్యత్తే వుండదన్న భీతి వ్యాపించడంతో, విద్యార్థులలో ఈ ఉద్యమం ప్రాకిపోతూంది. ఇప్పటికే 70, 80 శాతం మార్కులు సాధించినా కాలేజీలలో సీట్లు దొరకడం గగనంగా వుందని, కొత్త విధానం అమలైతే అగ్రవర్ణాల విద్యార్థులు చదువులే చాలించుకోవలసిన పరిస్థితి ఏర్పడుతుందని వీరు భయపడుతున్నారు.

హైదరాబాదు, విజయవాడ, విశాఖపట్నం నగరాలలో కళాశాల ప్రాంగణాలలో ఈ ఉద్యమ తరంగాలు ఎక్కువగా వీస్తున్నాయి. ఇప్పటికే ఉస్మానియా విశ్వవిద్యాలయంలో విద్యార్థులు ఎం.కాం. పరీక్షలను బలవంతంగా నిలుపు చేయించారు; బస్సులు తగులబెట్టారు. విజయవాడలో ఊరేగింపులు, ప్రదర్శనలు జరిగాయి. విశాఖపట్నంలో ఏకంగా బంద్‌కే పిలుపునిచ్చివున్నారు. ప్రతినగరంలో, గుజరాత్ తరహా 'నవ సంఘర్షణ సమితులు' ఏర్పడుతున్నాయి. వీటి స్థాపకులు, నిర్వాహకులు కూడా విద్యార్థులే!

అంతే రాజకీయవాదులు మాత్రం ఇప్పటివరకు ఈ రొంపిలోకి దిగడానికి సాహసించడంలేదు. దాదాపు అన్ని ప్రతిపక్షాలు ఏవో కొన్ని మినహాయింపులతో రిజర్వేషన్ల నూతన విధానాన్ని విమర్శించినా, పోషించి విద్యార్థులకు చేయూతనందించే స్థితిలోలేవు.

ఎంతవరకు నిజమోకాని, ఈ ఉద్యమాన్ని పరోక్షంగా తెలుగుదేశం నాయకులే నడిపిస్తున్నారన్న పుకార్లు ప్రబలుతున్నాయి. తెలుగుదేశం నాయకులంటే అందరూకాదు- అన్నగారి అనుగ్రహానికి పాత్రులు కాలేకపోయిన వారు, చిన్నల్లుడి ఆగ్రహానికి గురై అనామకులుగా వుండిపోయినవారు పరోక్షంగా నిప్పు ఎగదోస్తున్నారంటున్నారు. వీరిలో పెద్దల్లుడు డాక్టర్ వెంకటేశ్వరరావు కూడా వున్నాడని వినికిడి. తనతో సంప్రదించ

—కొరవ 7 వ పేజీలో

# జమీన్‌రైతు

## చిచ్చు పెట్టవద్దు!

తెలుగుదేశం ప్రభుత్వం ఏసమస్యనుకూడా రాజకీయ స్వార్థ దృష్టితోనో, ఎన్నికల ఎత్తుగడగానో తప్ప చూడడంలేదు. ఆవిధంగానే పార్టీనాయకుడు, ముఖ్యమంత్రి అయిన శ్రీ ఎన్. టి. రామారావు ఓట్లకోసం, సామాన్య ప్రజల ఆకర్షణకోసం వేషాలు మార్చడమూ మామూలైపోయింది అకస్మాత్తుగా వెనుకబడినతరగతుల రిజర్వేషన్ శాతాన్ని నలభైనాలుగుకు పెంచి, ఆ వేడిలో సన్యాసిదుస్తులకుతోడు కాషాయ తలపాగా ధరించి హెలికాప్టరారూఢుడై ప్రజలముందుకు రావడమే వీటికి తాజానిదర్శనం.

రిజర్వేషన్ల సమస్య వివాదాస్పదమైంది: కులాన్నిబట్టి రిజర్వేషన్ అశాస్త్రీయము, అన్యాయమనే అభిప్రాయం, విజ్ఞులైన వారందరిలో వుంది. కులం ఏదైనా పేదరికం ప్రాతిపదికగా విద్య వుద్యోగాలలో రిజర్వేషన్లుకాని, ఇతర ప్రభుత్వ సహాయాలుగాని వుంటే పేదవాళ్ళందరికి వుపకారం జరుగుతుంది. గర్భదరిద్రుడైనా అగ్రకులంలో పుట్టిననేరానికి చదువుసంధ్యలు, వుద్యోగ సద్యోగాలు లేకుండా అతడు శాపగ్రస్తుడు కావలసివస్తే, కడుపు మండిపోతుంది; అది సమాజంలో అసహనానికి, అలజడికి, ఆందోళనకు దారితీయడమే కాకుండా, ఏ అసమానతల నిర్మూలనకైతే రిజర్వేషన్ విధానం అమలుజరుపదలుస్తున్నారో, కొన్ని సంవత్సరాల తర్వాత ఆ అసమానత మరికొన్ని కులాలకు సంబంధించి మరొక రూపంలో ప్రత్యక్షమవుతుంది. అంటే కులప్రాతిపదికగా జరిగే సహాయాలు అసమానతలను తొలగించలేవు: వాటిని శాశ్వతీకరిస్తాయన్నమాట.

వెనుకబడినతరగతుల రిజర్వేషన్లను విపరీతస్థాయికి పెంచిన కారణంగా గుజరాతులో, ముఖ్యంగా అహమ్మదాబాద్ నగరంలో రెండుమూడేళ్ళక్రితం పడిన చిచ్చు ఈనాటికీ ఆరకుండా వుంది. రిజర్వేషన్ల పెంపుదలను అమలుజరపకుండా ఆపినా, ఒక ముఖ్యమంత్రిని పదభ్రష్టుణ్ణి చేసినా ఆ పురిడు వుండుగానే వుంది. రానున్న పంచాయతీ తదితర ఎన్నికలను దృష్టిలోపెట్టుకొని తన శాసనసభపార్టీ ఎరుకగూడాలేకుండా ముఖ్యమంత్రి శ్రీ రామారావు హఠాత్తుగా వెనుకబడినతరగతుల రిజర్వేషన్లు పెంచడం మనరాష్ట్రంలోకూడా చిచ్చుపెట్టడమే అవుతుంది.

ఆ చిచ్చేకాకుండా మరొక చిచ్చునుకూడా పెడుతున్నాడు. పంచాయతీ, పంచాయతీమండల ఎన్నికలు పార్టీ ప్రాతిపదికమీద జరపదలచామని ముఖ్యమంత్రి ప్రకటించాడు. బహుశా సహకార ఎన్నికలకుకూడా ఈ పార్టీ సూత్రాన్ని వర్తింపజేసినా ఆశ్చర్యంలేదు. గ్రామకక్షలతోనే ఎన్నికల సమయంలో పల్లెలు తగులబడిపోతుంటాయి. వాటికి పార్టీ రాజకీయాలుకూడా తోడైతే పరిస్థితి మరీ భగ్గుమంటుంది; ప్రశాంతంగా వుండవలసిన పల్లెలు శాశ్వతంగా అశాంతినిలయాలైపోతాయి. పంచాయితీలుగాని, మండలాలుగాని, మునిసిపాలిటీలుగాని పౌరసౌకర్యాలను కల్గించుటకు, గ్రామాభివృద్ధి కార్యక్రమాలను అమలుజరుపుటకు రాజకీయాలకు అతీతంగా వుండవలసిన సంస్థలు, విధానాలను రూపొందించేవి కావు. రాజకీయ అనుబంధాలను ప్రక్కనపెట్టి, వ్యక్తుల అర్హతానర్హతలనుబట్టి ఎన్నుకోవలసిన సంస్థలు. అటువంటి సంస్థల ఎన్నికలలో కూడా రాజకీయపార్టీలను ప్రవేశపెట్టజూడడమంటే తన సినిమా మోజును ఇందులోకూడా ముఖ్యమంత్రి శ్రీ రామారావు రాజకీయంగా సొమ్ముచేసుకోవాలని వుద్దేశించడం; ప్రభుత్వాధికారాన్ని దుర్వినియోగంచేసి ఆ సంస్థలనుసైతం కబళించ ప్రయత్నించడమే అవుతుంది. అంజయ్య ముఖ్యమంత్రిగా కాంగ్రెస్ ప్రభుత్వం పార్టీ రహితంగా పంచాయతీరాజ్య సంస్థలకు ఎన్నికలు జరిపించింది. ఋషితుల్యుణ్ణని తనకుతాను ప్రకటించుకునే శ్రీ రామారావు ఆమాత్రం విశాలదృక్పథాన్ని ప్రదర్శించలేకపోవడం హాస్యాస్పదంగా వుంటుంది.

రిజర్వేషన్ల చిచ్చుకుతోడు పంచాయతీరాజ్య సంస్థల ఎన్నికలలో పార్టీల చిచ్చునుకూడాపెట్టి రాష్ట్రాన్ని అశాంతిపాలు గావించవద్దని తెలుగుదేశం ప్రభుత్వాన్ని కోరుతున్నాము

## జమీన్‌రైతు 17-7-1936

### వెంకటగిరి పట్టాభిషేకం

శ్రీ వెంకటగిరి కుమార రాజా సాహెబులవారికి రాగల మాఘశుద్ధ పంచమినాడు (వెంకటగిరి సంస్థానమును పట్టాభిషేకముచేసి, తండ్రిగారు వానప్రస్థాశ్రమాన్ని పుచ్చుకొంటారని వదంతి. వసిష్ఠులవారు ముహూర్తాన్ని పెట్టారట. అయితే ఆనాడే తండ్రి తల్లిగారి తిథియన్నదని వసిష్ఠవచ్చునా, వసిష్ఠులవారి మీమాంస. మహారాజుగారు పూర్వమువలెనే అన్నిటా సమర్థులుగా నున్నప్పుడు ఈ పట్టాభిషేకావసరం యేలా కల్గిందనే సంశయం అందర్నీ బాధిస్తూనేవుంది. మరొకటి బాలాజీరావు నాయుడుగారు దివానుగిరి వదిలేటప్పుడు మహారాజా, మహారాణిగార్ల సమక్షాన యేదో రహస్యం చెవివేశారట. అది కైకేయీ వరాలమాదిరి అడ్డంరాదనే అందరు అనుకుంటున్నారు. ఈ విషయం ఇంకా తెరమరుగున్నే వుంది. వివరాలు ముందు.

### ముత్తుకూరులో ఉప్పు లైసెన్సుదార్ల సంఘము

ఉప్పు లైసెన్సుదార్ల సంఘమును స్థాపించుటకై 12 వ తేదిన ఆచార్య రంగాగారు యం. ఎల్. ఎ. ముత్తుకూరుకు ఆహ్వానింపబడిరి సాయంత్రము 6 గంటలకు బహిరంగసభ జిల్లా కాంగ్రెసు అధ్యక్షుడగు ఓరుగంటి వెంకటసుబ్బయ్య గారధ్యక్షతన జరిగెను ఆచార్యరంగాగారుపన్యసించుచు సంఘముయొక్క ఆవశ్యకతనుగూర్చి తెల్పిరి. సభానంతరం

### 50 ఏళ్ల క్రితం ఈవారం

ప్రత్యేక సంప్రతింపులు జరిగి వుప్పు లైసెన్సుదారులసభ యేర్పాటు చేయబడెను.

#### నెల్లూరు ముచ్చట్లు

15 వ తేది జరిగిన మునిసిపల్ మీటింగు వ్యవహారాలుచూస్తే పూర్వముండిన ఛేర్మెను పార్టీ చెల్లాచెదరైనట్టు తోస్తుంది. మామూలుగా జరిగే పార్టీమీటింగు యీసారి జరగక ఓటింగ్‌లో పార్టీ చీలిపోయింది. పాపం సంజీవశెట్టిగారు వచ్చివుంటే యీలా జరిగివుండేది కాదంటాడేమో నైగర్వం విహారి. ప్రతిపక్షీయులకు మెజారిటీతేకూరడంచేత పార్టీమీటింగు పెట్టుకోవడం వీరు ప్రారంభించారు. ఛేర్మెను పార్టీలో కల్గిన కలకలం సమసిపోతుందో, పార్టీని చెదరగొడుతుందో రెండు మీటింగుల్లో బయటపడుతుంది.

• • •

నరసింములకొండ వ్యవహారాలు నానా తండాలంగా వుండగా ఒక ట్రస్టీయగు యిందూరు పట్టాభిరామరెడ్డిగారి భూములను, దేవస్థానం భూములను సాగుచేయించే యిందుపూరు సుబ్బరామరెడ్డిగారిని మూడో ట్రస్టీగా నియమించడం పట్టాభిరామరెడ్డిగారికి మెజారిటీ చేకూర్చేవుద్దేశం తప్ప మరేమీకాదు గర్తువారికి. ప్రజలన్నా కొంత ఆందోళన చేయకపోతే యీ దేవస్థానం పరిపాలన అధోగతిపాలుకాక తప్పదు.

#### చిత్తూరు మునిసిపాలిటీకి రద్దు నోటీసు

కలెక్టరువారి సూచనలననుసరించి పన్నులను హెచ్చించుటకు కన్సిలు వారు అంగీకరించకపోయినందున మునిసిపాలిటీని ఎందుకు రద్దుచేయకూడదని ప్రభుత్వంవారు నోటీసు ఒసంగియున్నారు.

# వైద్యవృత్తిని జాతీయంచేయాలి!

డాక్టర్ల దోపిడి గురించి నామాటలో వ్రాసింది (జులై 4) అక్షరాలా నిజం. వైద్యవృత్తిలో నైతిక ప్రమాణాలు పడిపోవడమేకాదు, చట్టం దృష్టిలోకూడా ఈ పవిత్రమైన వృత్తి 'వ్యాపార సంస్థ' (Commercial establishment) గా గుర్తింపు పొందింది. సాధారణ వ్యాపారం, వాణిజ్యంవలెనే, మహారాష్ట్రలో, 1948 బొంబాయి షాప్స్ అండ్ ఎస్టాబ్లిష్‌మెంట్స్ యాక్టు ప్రకారం, వైద్యవృత్తిని ఫక్తు వ్యాపారంగా పరిగణిస్తున్నారు.

అంతేకాదు. ప్రఖ్యాత న్యాయమూర్తి జస్టిస్ కృష్ణ అయ్యర్, ప్రసిద్ధి చెందిన బెంగుళూరు వాటర్ వర్క్స్ కేసులో న్యాయవాదవృత్తికూడా ఒక పరిశ్రమేనని నిర్వచించారు. అంటే ఒకప్పుడు పరమపవిత్రమైనవిగా పూజింపబడిన న్యాయవాద, వైద్యవృత్తులు వ్యాపారం క్రింద జమకట్టాయన్నమాట.

డాక్టర్లు ప్రజలను దోపిడిచేసే విధానం రూపుమాపడానికి రష్యాలోవలె వైద్యవృత్తిని జాతీయంచేసి, ప్రైవేటు ప్రాక్టీసును నిషేధించాలి. అప్పుడే సగటు మానవుడు తన ఆర్థిక స్తోమతతో సంబంధం లేకుండా న్యాయమైన వైద్యసహాయం పొందగలడు. అది జరగనంతవరకు ఈ దోపిడిని ఎవరూ అరికట్టలేరు. వైద్యవృత్తిలో ప్రమాణాలు పడిపోతాయని చెప్పుకోవడం, ఎత్తి చూపడంవల్లకూడా ఏమీ ప్రయోజనం లేదు.

నెల్లూరు -ఎం. మల్లికార్జునరావు బికాం. బిఎల్.

## ప్రమాణాలు ఏవృత్తిలో దిగజారలేదు?

డాక్టర్ల దోపిడి (జులై 4) గురించి వ్రాస్తూ, కేవలం వైద్యవృత్తిలోనే నైతిక ప్రమాణాలు దిగజారిపోతున్నాయని వ్రేలెత్తి చూపడం ఏమిన్యాయం? అన్ని వృత్తులలో, రంగాలలో, కడకు పత్రికా రంగంలోకూడా ప్రమాణాలు దిగజారిపోవడంలేదా?

అయితే వైద్యవృత్తిని కేవలం వ్యాపారంగా మార్చి, అక్రమ లావాదేవీలను

## మేము-మీరు

ప్రోత్సహిస్తూ, అక్రమార్జనచేసే పైశాచిక ప్రవృత్తి కల్గిన ప్రబుద్ధులు వైద్యరంగంలో వున్నమాట వాస్తవం: కాని వారిసంఖ్య స్వల్పం: వారివల్ల తక్కిన వారంతా తలలు వంచుకోవలసిన దుర్గతి కల్గుతున్నది. ఈ అసాంఘిక శక్తులను సదా మేము నిరసిస్తాంకూడా!

ఇండియన్ మెడికల్ అసోసియేషన్ తరపున అటువంటివారిపై చర్య తీసుకోవడం వీలుపడదు. ఇది కేవలం

-కొరవ 10 పేజీలో

## జనవాణి

### జి. ప. ఐటిఐ వుంటుందా? వుండదా?

కావలిలో జి. ప. ఐటిఐ ఏ ముహూర్తంలో మొదలుపెట్టారోగాని అన్నీ అడ్డంకులే. ఈ సంవత్సరం దాన్ని అసలే ఎత్తివేస్తారనికూడా పుకారువుంది. అక్కడ పనిచేసే టీచర్లసందర్భి బదిలీ చేశారు. చాలామంది విద్యార్థులు ఐటిఐ సీట్లకు దరఖాస్తు చేసివున్నారు.

జిల్లాపరిషత్ అధికారులు ఈ సంవత్సరం ఐటిఐ వుంటుందా? వుండదా? అనేవిషయం ముందు తెల్పిచెప్పడం మంచిది. ఐటిఐ ఎత్తివేస్తే రెండవ సంవత్సరం 'ఫిట్టర్' చదువుతున్నవాళ్ళను ఏంచేస్తారోకూడా చెప్పడం అవసరం.

కావలి -ఫి. వి. సుబ్బారావు

### ఇళ్లముందు బంకులు

ఈమధ్యన ఇళ్ళముందు బంకులు పెట్టడం చాల ఎక్కువైంది ట్రంకురోడ్డు

-కొరవ 10 వ పేజీలో

# పాత బ్రిడ్జికి మంత్రిగారి కొత్తవార్త

జిల్లాలో బకింగ్ హాం కాలువమీద, కొత్తగా రెండుకోట్ల పెద్ద బ్రిడ్జిలు మంజూరైనాయని దుగరాజపట్నం, మైపాడు ఆ స్థలాలని రెవిన్యూమంత్రి శ్రీ నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి తెలియజేశారు. తాజావార్తగా సంపాదాయన ఈవిషయం.

మైపాడులో వంతెన నిర్మాణం మొదలుపెట్టి నాలుగైదు నెలలపైనే అయిందని, సగంపనికూడా పూర్తయిందని మంత్రిగారికి తెలియదేమో! శంకుస్థాపనకు ఆయన్ను పిలువలేదేమో, ఎట్లా తెలుస్తుంది పాపం!

## కళామందిర్ పోటీలు

నెల్లూరులో కొత్తగా ఏర్పడిన సాంస్కృతికసంస్థ 'కళామందిర్' ఆగస్టు నెలలో కళాకారులకు పోటీలు నిర్వహిస్తుందట. భరతనాట్యం, కూచిపూడి,

# నెల్లూరు సంగతులు

జానపదనృత్యాలు, సినిమా పాటల పోటీలు జరుగుతాయి. ఆసక్తి కలిగినవారు-శ్రీ టి. దాశరథి, అధ్యక్షుడు, సరస్వతి సమాజం, మూలపేట, నెల్లూరుకువ్రాసి, వివరాలు తెప్పించుకోవచ్చు.

## రామలీల పరిశ్రమ ప్రగతి

నెల్లూరులో మొట్టమొదటి రెడీమేడ్ దుస్తులతయారీ కేంద్రం - రామలీల ఎంటర్‌ప్రైజెస్. ఈ పరిశ్రమలో దాదాపు పందమందికిపైగా కుట్టుపనివారు పని చేస్తున్నారట. వీరికి సంవత్సరం ఎ. పి. స్టేట్ టెక్స్‌టైల్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ ద్వారా స్కూలుపిల్లలకు యూనిఫారాలుకుట్టే ఆర్డరు లభించిందట. సాధారణంగా మహిళామండలులు ఒకే యూనిఫారం కుట్టేందుకు మీటరుగుడ్డకు పైగా వాడుతారని, కాని తాము మాత్రం అందులో సగంగుడ్డతోనే యూనిఫారం పూర్తిచేస్తున్నామని, పరిశ్రమ యజమాని, మాజీ వి ఆర్. కాలేజి ప్రిన్సిపల్ శ్రీ ఆర్. సుబ్బారెడ్డి కుమారుడు, ఆర్. సుధాకరరెడ్డి చెప్పారు. త్వరలో తమ పరిశ్రమ తరపున పేద స్త్రీలు, వితంతువులకు ఉచిత కుట్టు శిక్షణా కేంద్రం ప్రారంభిస్తున్నామని కూడా చెప్పారాయన.

## ఇళ్ళస్థలాలు కావాలి

నెల్లూరులో తమకు ఇళ్ళస్థలాలు మంజూరు చేయకుంటే, ఉద్యమం ప్రారంభించి జైళ్ళకుపోతామని 'నె. జ. వె. క. సమాఖ్య' హెచ్చరిస్తూంది. వీరి సభ్యులు ఏడేళ్ళనుంచి ఇళ్ళస్థలాలకోసం అధికారుల చుట్టూ కాళ్ళరిగేలా తిరుగుతున్నారట. వీరందరూ ఈమధ్య శ్రీ బి. ముక్కంటిరాజు అధ్యక్షతన సమావేశమై, ఈ హెచ్చరిక చేశారు.

## వేణుగోపాలస్వామి కాలేజి ఎన్నికలు

మూలపేటలోని వేణుగోపాలస్వామి డిగ్రీ కాలేజి విద్యార్థి సంఘం ఎన్నికలు ఇటీవల జరిగాయి. గెలిచినవారందరూ

—కారవ 10వ పేజీలో

## ఆహ్వానము

నెల్లూరు స్టోన్‌హౌస్‌పేట శ్రీ భగవద్గీతా భవనమునందు ఆధ్యాత్మిక ఉపన్యాసములు శ్రీశ్రీశ్రీ యోగిని మాతాజీ గారిచే 24-7-86 నుండి 9-8-86 వరకూ ప్రతిరోజు ఉ॥ 6-30 నుండి 8 గం॥ వరకు యోగాభ్యాసములు సా॥ 6-30 నుండి 8 గం॥ వరకు సప్తమ స్కంధము (ప్రహ్లాద చరిత్ర) ప్రవచనములు జరుగును. జిజ్ఞాసువులెల్లరూ విచ్చేసి జయప్రదం చేయ ప్రార్థన.

సాధు భక్తమండలి

C/o. తన్నీరు చలపతి

సుందర్ క్లాత్ మార్టు కాపువీధి, నెల్లూరు

## ఉచిత విద్యార్థి వేతనము

శ్రీ సారంపాటి వీరన్నాచారి

విశ్వబ్రాహ్మణ విద్యానిధి

15/17 విద్యాభవనము హరనాథపురం

నెల్లూరు-3.

ఈ విద్యానిధి నుండి ఉచిత విద్యార్థి వేతనము కోరు కాలేజీలలో చదువుచున్న నెల్లూరు జిల్లాలోని బీద విశ్వబ్రాహ్మణ విద్యార్థులు రు. 1-55 లు మనియార్డరు చేసి పోస్టుద్వారాను స్వయముగా వచ్చి రు. 1-00 చెల్లించియు పై విద్యానిధి నుండి అచ్చు దరఖాస్తు ఫారము లు తెప్పించుకొని పూర్తిచేసి తేది 30-8-86 సాయంకాలం లోపల పై అడ్రసుకు చేర్పగోరుచున్నాము.

" సేవాతత్పర "

పుత్తేటి సుబ్రహ్మణ్యాచార్యులు

కార్యదర్శి




## జమీన్ రైతు చందా

| | |
|---|---|
| సంవత్సర చందా | 50.00 |
| ఆరునెలలకు | 26.00 |

విడిప్రతి: ఒక రూపాయి


# నెల్లూరు నలుచెరగుల్లో

## విహార్మకుడు

### ఏకాదశే ముందు!

ఏకాదశి ముందా ఏకాశి ముందా అనే పాతేశకు అంతరోపం పట్టింది, అంతకు ముందూ వంతేవసుకోంది. 1983 84, 85 సంవత్సరాల్లో తొలిఏకాదశే ముందు వచ్చింది, పెన్న వెనుకబడింది; ఈ సంవత్సరమూ పరా మే ముందే; జన్న టికి పట్టుమని పదిచినుకులు లేవు. ఏటికి దుక్కలేదు రాలేదు! సామశీల పూర్తి అయిందా నెల్లూరు కోవూరు రెల్ల రైతాంగం గతి అంతే!

### జగ్జీవన్‌రాం అస్తికలు

ఇటీవల దివంగతులైన కాంగ్రెస్ అగ్ర నాయకుడు బాబు జగ్జీవన్‌రాం అస్తికలు 15 తేది నెల్లూరుకు తీసుకురాబడి, ప్రజల దర్శనార్థం కాంగ్రెస్ ఆఫీసులో వుంచబడి 16 తేది పినాకినీ నదీ జలాల్లో నిమజ్జనం గావించబడినవి.

అస్తికల కలశాన్ని పి. వి. నరసింహరావుగారి కుమారుడు రంగారావు, మాజీ మంత్రి శ్రీ నమ్మయ్యగారలు 15 తేది సాయంత్రం విజయవాడ నుండి రైలులో తీసుకరాగా స్థానిక కాంగ్రెస్ వాదులు భక్తిశ్రద్ధలతో వాటినందుకొని వుత్సవంగా కాంగ్రెస్ ఆఫీసుకు తీసుకొనివచ్చి అలంకరించబడిన వేదికమీద వుంచారు. మరురోజు వుత్సవంగానే పెన్నకు తీసుకపోయి పెన్న పుణ్యజలాల్లో కలిపి వేశారు.

ఈ కార్యక్రమాల్లో మాజీ జి. ప. ఛైర్మన్ ఓరేపల్లి; పార్లమెంటు మాజీ సభ్యులు పసల పెంచలయ్య గౌస్ మొహిద్దీన్; జి. కాం. కార్యదర్శి పి. వి. సుబ్బారెడ్డి కోశాధికారి జె. కె. రెడ్డి; మాజీ శాసనసభ్యుడు సి. వి. శేషారెడ్డి, ఊటుకూరు ఆదిమూర్తి ప్రభృతులు పెందలాడిగా పాల్గొన్నారు.

### మాలకొండారెడ్డి హత్య- ఇద్దరికి జీవితఖైదు

28-3-85 తేది సాయంత్రం మునిసిపల్ ఆఫీసు సమీపంలో రోడ్డుమీద పరమకిరాతకంగా హత్యగావించబడిన టపుగా మార్కిస్టు నాయకుడు, మునిసిపల్ కౌన్సిలర్ వి. మాలకొండారెడ్డి కేసును నెల్లూరు అడిషనల్ జిల్లా సెషన్సుజడ్జి శ్రీ ఆర్. బయ్యపురెడ్డి విచారించి; ముద్దాయిలు షేక్ గయాజ్ (సంగం), పాశం వెంకటేశ్వర్లు (నెల్లూరు) నేరంచేసినట్లు రుజువైందని విశ్వసిస్తూ, వారిద్దరికి జీవితఖైదు విధిస్తూ ఈ రోజు (18 తేది) తీర్పు చెప్పారు.

గయాజ్, వెంకటేశ్వర్లు ఇద్దరినీ హత్యానంతరం మార్క్సిస్టులే పట్టుకొని పోలీసుకు అప్పగించారు. ఈ కేసులో ముద్దాయిలుగా భావించబడే మరోఇద్దరిలో అత్తిపల్లి శ్రీధరరెడ్డి (వావిళ్ళ) బాంబు పేలి ప్రకమనుగులో దుర్మరణంపాలు కాగా, ఆలం రాధమ్మ (తురిమెర్ల) పరారీలో వున్నారు ఈ నలుగురూ నక్సలైట్లుటాదు.

ఈ కేసులో ప్రాసిక్యూషను అడిషనల్ పబ్లిక్ ప్రాసిక్యూటరు శ్రీ పి. బలరామయ్య, ముద్దాయిల పక్షంగా శ్రీ ఓ. అప్పయ్యరెడ్డి వాదించారు

### పప్పులవీధి హత్య- 7గురికి జీవితఖైదు

స్టోన్‌హౌస్‌పేటలోని పప్పులవీధి పార్కు సమీపంలో, పట్టపగలు దారుణ హత్యకుగురైన దూబిశెట్టి నాగేశ్వరరావు అలియాస్ టైర్ల నాగేశ్వరరావు హత్య కేసులో 7 గురు ముద్దాయిలకు జీవిత ఖైదు శిక్ష విధించారు. అడిషనల్ జిల్లా సెషన్సు జడ్జి శ్రీ ఆర్. బయ్యపురెడ్డి ఈ కేసు విచారించి, 14 తేది తీర్పు చెప్తూ, నిందితులందరూ దోషులుగా భావించి, యావజ్జీవితఖైదు విధించారు, దీనితోపాటు వారు రు. 500 లు జరిమానాగూడా కట్టాలని, లేకుంటే మరొక ఆరు నెలలు శిక్ష అనుభవించాలని ఆదేశించారు. నిందితులు వీరు-చెరివెల్ల అజయకుమార్ చెరవెల్ల సునీల్‌బాబు, చెన్నారెడ్డి శ్రీనివాసులురెడ్డి, దూలం సురేష్, పాలూరి శేషయ్య, కాళహస్తి రవికుమార్, యకమా శంకర్.

నిందితులలో ప్రథముడైన అజయ్ ఉంపుడు గత్తెను నాగేశ్వరరావు బెదరించడంలో ఇద్దరిమధ్య కక్షలు పెరిగి, ఈ దారుణానికి దారితీసిందని ప్రాసిక్యూషన్ కథనం. హత్యమాత్రం - పాశవికంగా, చిత్రవధ చేసినట్లు జరిగింది

ఈ కేసులో ప్రాసిక్యూషన్ పక్షంగా అడిషనల్ పి పి శ్రీ పి. బలరామయ్య, ముద్దాయిల పక్షంగా శ్రీ సి. వి. సుబ్బరామయ్య, శ్రీ బి. వి. రమణారెడ్డి వాదించారు.

### ముఖ్యమంత్రిమాట ఇంకా చెల్లుబడికాలేదు!

ఇందుకూరుపేట శ్మశానంలో నలుగురైదుగురు గిరిజనులు ఇండ్లువేసుకోవడం, శవాన్ని దహనం చేస్తే ఆక్షేపించడం, దానిపై రైతులు వారి గుడిసెలు పీకివేయడం, కలెక్టరాది అధికార్లు రైతుల మీద ఆగ్రహించి, వారిమీద కేసులు పెట్టించి, పెరకేసిన గుడిసెలను తిరిగి నిర్మించి ఇవ్వడం. గ్రామమంతా అధికార్ల తొందరపాటు చర్యను గర్హించడం పాఠకులకు తెలుసు.

మొన్న ముఖ్యమంత్రి ముత్తుకూరుకు వచ్చినపుడు అధికార్ల ఆఘాయిత్యానికి గురియైన రైతులు అక్కడకుపోయి ఆయనకు మొరపెట్టుకున్నారట. ముఖ్యమంత్రి అక్కడికక్కడే జాయింట్ కలెక్టర్నుపిలిచి గిరిజనులను శ్మశానంనుండి లేవదీసి వారికి ప్రత్యామ్నాయపు వసతి చూపించవలసిందని, రైతులమీద పెట్టిన కేసులను వెంటనే వుపసంహరించవలసిందని ఆదేశిస్తూ, న్యాయం జరుగుతుందని రైతులకు అభయమిచ్చారట.

ముఖ్యమంత్రి మాటచెప్పి వారమైంది. అయినా గిరిజనుల గుడిసెలు శ్మశానంలోనే వున్నాయి; రైతులమీద కేసులు అమల్లోనేవున్నాయి. ఇదీసంగతి:

### విదేశాలకు వెళ్ళివచ్చిన మన ఇంజనీరు

కడపలో విద్యుత్‌శాఖ సూపరింటెండింగు ఇంజనీరుగా పనిచేస్తున్న నెల్లూరీయుడు శ్రీ ఎ. వి. రాఘవరెడ్డి ఇటీవల కెనడాలోని టొరెంటోనగరంలో "ఎలక్ట్రికల్ పవర్ ట్రాన్స్‌మిషన్" ను గూర్చి జరిగిన ఎకడమిక్ అంతర్జాతీయ గోష్ఠిలో ఘుగ్గకు భారత ప్రతినిధులలో ఒకరుగా పాల్గొని వచ్చారు. ఆ సింపోజియమ్ అనంతరం మూడువారాలపాటు అమెరికాలో పర్యటించి డిస్ట్రిబ్యూషన్ ట్రాన్స్‌ఫార్మర్లు, విద్యుత్ ప్రసార తీగలు స్విచ్‌గేర్లు, బ్రేకర్లు వగైరాల వుత్పత్తి; మన ఆత్మకూరు తాలూకాలో అమలులో వున్న రూరల్ ఎలక్ట్రికల్ కార్పొరేషన్ల వంటివి అక్కడ ఏవిధంగాపనిచేస్తున్నది, వగైరా అనేకవిషయాలను అధ్యయనం కూడా చేశారు.

శ్రీ రాఘవరెడ్డి కోవూరుతాలూకా నాయుడుపాళెంవాసి; 1967 వరకు నెల్లూరులో ఎ. డి. ఇ. గా పనిచేసి, తర్వాత డి. ఇ. గా, అపిమ్మట ఎస్. ఇ. గా క్రమోన్నతిపొంది ప్రస్తుతం కడపలో వున్నారు.

మన జిల్లాకుచెందిన విద్యుత్‌శాఖ ఇంజనీర్లు కొందరు రాఘవరెడ్డిగారివలెనే విదేశాలకుపోయి వస్తున్నారు. అటువంటివారు అక్కడ పరిస్థితులను మన పరిస్థితులతో పోల్చి తమ అనుభవాలు వ్యాసరూపంలో పెట్టగలిగితే మనమెక్కడున్నామో తెలుసుకునే అవకాశం మన ప్రజలకు కలుగుతుంది, కాని అధికార్లు వున్నదివున్నట్లు, అనుకున్నది అనుకున్నట్లు వ్రాయడానికి లేదుగదా!

### విద్యార్థిని ప్రతిభ

దేశస్థాయిలోజరిగే నేషనల్ టాలెంట్ సర్వే ఎగ్జామినేషన్‌లో నెల్లూరు విద్యార్థిని కుమారి బి. హరిత ఉత్తీర్ణురాలైందట. అరుదైన ప్రతిభలేనిదే ఈ పరీక్ష పాసు కావడం కష్టం. ఈమె నెల్లూరులోని దీపస్టడీ సర్కిల్ విద్యార్థినిఅట శ్రీహరిరెడ్డి, డాక్టర్ కృష్ణవేణిల కుమార్తె హరిత.

### యువకుడి ఆత్మహత్య

నెల్లూరు స్టోన్‌హౌస్‌పేటలో 14 తేది మిరియాల ప్రభాకరరెడ్డి (30)అనేయువకుడు ఆత్మహత్య చేసుకున్నాడట. కుటుంబ కలహాలవల్ల ఎండ్రిన్ త్రాగాడని తెలుస్తోంది.

### ఇస్లాం బోధనలు

రేపటినుంచి (19 తేది) మూడు రోజులపాటు నవలాకుల తోటలో ఇస్లాం మతబోధనలు జరుగుతాయి. ఏడాదికొక్కసారి దేశంలో ఏదో ఒక నగరంలో ఇవి జరపడం అలవాటట. ఈసారి ఆ అవకాశం నెల్లూరుకు లభించింది. ఒక్క మన దేశంనుంచేకాక, మలేషియా, ఇండోనేషియా, అరబ్, ఆఫ్రికా దేశాలనుంచి కూడా పేరుపొందిన మతగురువులు పాల్గొంటున్నారు. దాదాపు లక్షమంది ముస్లింలు ఈ బోధనలు వినడానికి వస్తారని అంచనా. శ్రీ మౌలానా ముఫ్తి అబ్దుల్ రహ్మాన్‌సాహెబ్ వీటిని నిర్వహిస్తున్నారు. భక్తులందరికి భోజనాది వసతులుకూడా సమకూరుస్తున్నారు.

### లయన్స్ కార్యవర్గం

నెల్లూరు లయన్స్‌క్లబ్‌కు నూతనకార్యవర్గం ఎంపికైంది. అధ్యక్షుడుగా శ్రీ ఎన్. మల్లికార్జునశర్మ, ఉపాధ్యక్షులుగా జి. వి. వెంకటరావు, డాక్టర్ సి. ఆర్. రెడ్డి, డాక్టర్ కె. సత్యనాథ్; కార్యదర్శిగా శ్రీ ఎస్. ఎస్. వి. రామమోహనరావు, సహాయ కార్యదర్శిగా పి. ప్రభాకర్, కోశాధికారిగా పి. సత్యనారాయణ, ఎన్నికైనారు. డైరెక్టర్లుగా శ్రీ బి. ఉదయభాస్కరరావు, పి. ముత్యాలశెట్టి, డాక్టర్ జి. కొండారెడ్డి, పి. శ్రీనివాసులు, వి. దివాకరమూర్తి, ఎస్. వి. రమణయ్య, బి. చిదంబరం తదితరులు నియమితులైనారు.

లయన్స్‌క్లబ్ ప్రతి 3వ ఆదివారం పొదలకూరురోడ్డులో ఉచిత వైద్యచికిత్స శిబిరం నిర్వహిస్తున్నదట.

### సాహితీ సప్తాహం

దక్కన విజ్ఞానకేంద్రం ఆధ్వర్యంలో 21 నుంచి 27 తేది వరకు టౌన్‌హాల్లో సాహితీ సప్తాహం జరుగుతుంది. రోజుకొక్కరు లెక్కన ఏడుగురు ప్రముఖ పౌరాణిక పురుషులపై ప్రసంగాలుంటాయి; అందరూ ఆహ్వానితులే!

### ఆస్పత్రులు

జిల్లాలోని 6 ఎల్. ఎఫ్. డిస్పెన్సరీలను అప్‌గ్రేడ్‌చేసి ప్రభుత్వ ఆస్పత్రులుగా మార్చారు. అవి ఇవీ- వింజమూరు, బుచ్చిరెడ్డిపాళెం, ఇందుకూరుపేట, కోట, నాయుడుపేట, సంగం. వీటికి ఏడాదికి 30 వేల విలువైన మందులిస్తారు; రెవిన్యూమంత్రి శ్రీ ఎన్. శ్రీనివాసులురెడ్డి ఈ విషయం చెప్పారు.

### మరణం

స్వాతంత్ర్య సమరయోధుడు, పాతకాంగ్రెస్‌వాది, న్యాయవాది శ్రీ కె. ఎల్. నారాయణరావు ధర్మపత్ని; వెంకటగిరిలో జి. త. బాలికల హైస్కూలు ప్రారంభించినప్పటినుండి దాని ప్రధానోపాధ్యాయినిగా పనిచేసి రిటైరైన శ్రీమతి త్రిపుర సుందరి (61) 4 తేది దివంగతురాలైంది

వృద్ధాప్యంలో సతీ వియోగం ఒక కఠోరశాపం. ఈ సమయంలో వియోగ విచారంతో వున్న నారాయణరావుగారికి మా ప్రగాఢసంతాపం తెలియజేస్తున్నాము

### నీటిమట్టం

| | |
|---|---|
| *కనిగిరి రిజర్వాయరు | (నీటిలేవు) |
| సర్వేపల్లి | 3 . 2 అ. |
| నెల్లూరు చెరువు | 10 . 1 అ. |

### నెల్లూరు బజారు

| మొలగొలుకు | |
|---|---|
| 9672- | 1625-00 |
| 9674- | 1650-00 |
| ఐ ఆర్ 20 | 1400-00 |
| 2508 | 1370-00 |

# పంచాయితీబిల్లు

(మొదటి పేజీ తరువాయి)

కొనసాగించడమో, లేకుంటే డివిజన్ స్థాయిలో పరిషత్‌లు ఏర్పరచడమో చేయాలని అభిప్రాయపడ్డారట. మరొక ఏడెనిమిదిమంది ఎమ్మెల్యేలుకూడా ఇదే ధోరణిలో మాట్లాడారట.

ఒక్కరైన బడిపిల్లల్లాంటి తనపార్టీ ఎమ్మెల్యేలు తనముందే తన నిర్ణయాలను తీసి ప్రక్కన పారేస్తుంటే పాపం ఎన్. టి. ఆర్. కు దిక్కుతోచలేదట. ధిక్కారముసైతునా? కొద్దిసేపు మౌనంగా, గంభీరంగావుండి, తర్వాత సరే చూద్దాం అని లేచిపోయారట.

సందట్లో సమారాధనగా రామనారాయణరెడ్డి రెవిన్యూమంత్రిపైనా ధ్వజమెత్తారట; స్వంతజిల్లా మంత్రులకు ప్లానింగ్‌బోర్డుల అధ్యక్షతవహించే అధికారం లేదని చెప్పినప్పుడు ఆయనకు మాత్రం మినహాయింపేమిటని గద్దించారట. ఎన్టీఆర్ అది తప్పేనని ఒప్పుకున్నారట.

సమావేశం పూర్తికాగానే ఎన్టీఆర్ తనఇంట్లో మంత్రివర్గం ఇష్టాగోష్ఠి సమావేశం ఏర్పాటుచేసి, పంచాయతీ బిల్లు మార్చిపారేద్దామని చెప్పారు. అందుకనుగుణంగా రేపు (19 తేది) క్యాబినెట్ సమావేశం జరుగుతుంది.

ఈ బిల్లు మార్పు ఎమ్మెల్యేలకంటే, మంత్రి జానారెడ్డికి గెలుపుగా భావిస్తున్నారు పరిశీలకులు. మంత్రివర్గ ఉపసంఘంలో బిల్లుముసాయిదా చర్చకు వచ్చినప్పుడే ఆయన దాన్ని వ్యతిరేకించారట. కానీ ఎవరూ వినిపించుకోలేదు. ఇప్పుడు తాననుకున్నది నెరవేరింది. శ్రీనివాసులురెడ్డికి నెల్లూరు జిల్లా ప్లానింగ్‌బోర్డు అధ్యక్షతకు అవకాశం కల్పించడంపైకూడా జానారెడ్డిమొదట్లోనే అభ్యంతరం చెప్పారట. ఇన్నాళ్ళకు ఆ కోరికా తీరబోతుంది.

యువ ఎమ్మెల్యేలందరూ తమ వాగ్ధాటితో ముఖ్యమంత్రిని అదరగొట్టడం, చాలామంది మంత్రులకుకూడా చిన్నతనమైందంటున్నారు.

మొత్తానికి తమ మాట చెల్లుబాటు కావడం తెలుగుదేశం యువఎమ్మెల్యేలకు అమితమైన సంతసం కల్గిస్తోంది. మేరు పర్వతంవంటి ముఖ్యమంత్రి పట్టి సంతకాలకే విరగబడడం, పిల్లిలా తమకు లొంగిరావడం వీరికి విస్మయంతోపాటు, విజయగర్వం కల్గిస్తోంది. ఎన్టీఆర్‌ది మేకపోతు గాంభీర్యమేనని తమకు తెలిసివుంటే ఈపాటికెప్పుడో ఈ అస్త్రాలు సంధించివుండేవారమని ఒక ఎమ్మెల్యే అన్నారు. ★

## రిజర్వేషన్లు

(మొదటి పేజీ తరువాయి)

కుండా, మాట మాత్రం చెప్పకుండా, ఇంతటి ప్రాముఖ్యం కల్గిన విధాన నిర్ణయాలు తీసుకున్నందుకు, ఒక్కసారి గట్టిపాఠం నేర్పడం అవసరమన్నది వీరి ఆలోచన అట.

జానారెడ్డి, రామచంద్రారెడ్డి వంటి కొందరు మంత్రులుకూడా రహస్యంగా ఉద్యమంలో తామనుసరించవలసిన వ్యూహాలను గురించి చర్చించుకుంటున్నట్లు తెలుస్తోంది.

ఇదిట్లావుంటే, ప్రభుత్వం మాత్రం ఇప్పుడు చెలరేగుతున్న ఉద్యమాన్ని సంపూర్ణంగా అణచివేయగలమన్న విశ్వాసంతోవుంది. ఏ రాజకీయపార్టీకూడా ఉద్యమానికి మద్దతు ప్రకటించలేదని, విద్యార్థులలోకూడా ప్రస్తుతమున్న చీలికలవల్ల సంఘటిత పోరాటం అసంభవమని వీరు నమ్ముతున్నారు. రాజకీయంగా తమ యువజన సంఘాలద్వారా, పోలీసు బలప్రయోగంద్వారా ఉద్యమాన్ని అవలీలగా ఎదుర్కోగలమన్నది వీరి దృఢసంకల్పం. ★

## జిల్లావార్తలు

(5వ పేజీ తరువాయి)

లయం ఎదుట పికెటింగ్‌కూడ జరిపారు.

ఈ పథకం నిర్మాణం 1983 లో మొదలై, ఇటీవల పూర్తయిందట. అయితే అది సక్రమంగా పనిచేయనందువలన నీటిసరఫరా జరగక ప్రజలు పలు ఇబ్బందులు పడుతున్నారట. పికెటింగ్ జరిపిన వారు వీరు- తాలూకా అధ్యక్షుడు శ్రీ కంచి సుధాకర్‌రెడ్డి, పట్టణ అధ్యక్షుడు శ్రీ చిట్టమూరి వేమిరెడ్డి, ప్రధాన కార్యదర్శి శ్రీ చెరుకూరు రమణనాయుడు, టి. జె. వై. ఎం. అధ్యక్షుడు నరసింహారెడ్డి. వీరితోపాటు 100 మంది కార్యకర్తలు పాల్గొన్నారు. పోలీసులు అందరినీ అరెస్టుచేశారు.

### కోట టీచర్లకు అప్పులు

కోట పంచాయతీ సమితిలోని 155 మంది టీచర్లకు టీచర్స్ కోఆపరేటివ్ క్రెడిట్ సొసైటీ నుంచి మూడు లక్షల రూపాయలు స్వల్పకాలవాయిదా రుణాలుగా ఇచ్చారు, ఈ రుణాలను మంజూరు చేసినందుకు సెంట్రల్‌బ్యాంకు మేనేజరు శ్రీ ఆదంరెడ్డిని, కోట బ్రాంచి మేనేజరు శ్రీ నరసింహరాజును అభినందిస్తున్నారు సొసైటీ అధ్యక్షుడు శ్రీ భోగేశ్వరం. ★

## ప్రకటన

కందుకూరు తాలూకా, తిప్పేర్వమూడి గ్రామ కాపురస్తుడు, విజనాధ పేరయ్య నాయుడు కుమారుడు రంగస్వామి నా వద్ద రు 25,000/- లు బాకీ పడు టకు 27-10-77 తేదిన ప్రామిసరీ నోటు వ్రాసిఇచ్చి వున్నాడు. అందుకు జామీనుగా ఆయన వారసత్వ నెల్లూరులో తన ఆస్తికి సంబంధించిన దస్తావేజులు డిపాజిట్‌చేసి, సదరు దస్తావేజులలోని తన ఆస్తిని, ప్రాంసరీనోటు మొత్తము నకు కైటిలేటిక్ డిపాజిట్‌చేయుటద్వారా ఆరుమానము సైతము పెట్టినారు. నాకు ఇవ్వవలసిన బాకీని ఏమీ చెల్లించకుండా, ఆయన తన ఆస్తిని పరాధీనము చేయు టకు ప్రయత్నం చేయుచున్నట్లు తెలియు చున్నది. ఆయన ఆస్తిని ఎవరైననూ విక్రయించుకున్నయెడల సదరు ఆస్తి నా పేరటి ఆరుమానమునకు లోబడియున్నందు వలన విక్రయించుకొన్నవారెవరైననూ, నాకు రావలసిన మొత్తమును చెల్లించు టకు బాధ్యులగుదురని ఇందుమూలముగా తెలియజేయడమైనది.

-సురేష్ కుమార్
S/o. వస్తిమల్‌జీ
కాపువీధి - నెల్లూరు

---

నంద్యాల సబార్డినేటు జడ్జికోర్టులో
E. P. No. 15 of 1983
O. S. No. 40 of 1981

శ్రీ భాగ్యలక్ష్మి ఫైనాన్స్ కార్పొరేషన్ (రి) రెప్రజెంటెడ్ by its మేనేజింగ్ పార్టనర్, పామూరు ఆంజనేయులు. S/o. సుబ్బయ్య, సుమారు 38 సం.లు. వ్యాపారం, నంద్యాల, కర్నూలుజిల్లా
-DHR

(1) పాద్యం శంకరరెడ్డి, (2) పాద్యం రాఘవరెడ్డి, S/o. వెంకటరెడ్డి 42 సం. హిందువు,వ్యాపారం D.No.25/161 సంజీవనగర్, నంద్యాల, కర్నూలు జిల్లా
-JDRS

ఈ నెంబరు డిక్రీదార్ క్రింద 2వ ప్రతివాది తాలూకు క్రింది షెడ్యూలు దాఖలా స్థిరాస్తిని పైకోర్టువారి యెదుట 11-8-86తేదిన ఉ.10-30గం.నుండి పబ్లిక్ వేలం వేయబడును. కొనదలచిన సవాలుదార్లు వేలంలోపాల్గొని వేలంపాడు కొనవచ్చును.

షెడ్యూలు

కర్నూలు డి. నంద్యాల సబ్ డి.లో చేరిన నంద్యాల తాలూకా నంద్యాలగ్రామం మున్సిపలు లిమిట్సులో చేరిన నంద్యాల కో-ఆపరేటివ్ హౌస్ బిల్డింగ్ సొసైటీలో వుండబడిన JDR-2 తాలూకు స్థిరాస్తి వివరము : ప్లాట్ నెం, సి-32 గల ప్లాట్‌కు చెక్కుబంది. తూ) ప్లాట్ నం సి-35, ప) 40" ల. వెడల్పు గల రోడ్డు, ఉ) 60" ల. వెడల్పుగలరోడ్డు, ద) ప్లాట్ నెం. సి-52. ఈ దిశలకు లోనైనస్థలమునకు కొలతలు:తూ ప.48"ల. ఉ. ద. 90" ల. గల 9.92 సెంట్లు గల స్థలం.

DHR మతింపు రు 20,000/-
N. B.: E. C. లోని తగాదాలు ఏమి లేవు.

-ఎ. శేషఫణి, డి హెచ్.ఆర్. అడ్వకేట్

---


జమీన్‌రైతు చందా

| | |
|---|---|
| సంవత్సర చందా | 50.00 |
| ఆరునెలలకు | 26.00 |

విడి ప్రతి 0.50


---

# ★★ పెండ్లిండ్లు ★★

### ఐపోజా 'బొద్ద'-
### హైదరాబాదు పెండ్లి

పైరా వ్యాపారరత్నమై ఐపోజాకుపోయి, హోటల్‌వ్యాపారంలో ఒక్కటై ఒసాగాలో స్థిరపడిన శ్రీ బొద్ద రఘునాథరెడ్డి కుమా రుడు; ఆంటీ మద్రాసు- టాజ్ కోరమం డల్ యజమాని శ్రీ బొద్ద సుబ్బరామిరెడ్డి (టి. ఎస్. రెడ్డి) తమ్ముని కుమారుడు ప్రకాష్; హైదరాబాదు- శ్రీ జె. బ్రిజ్ మోహన్‌రెడ్డి కుమార్తె, మద్రాసులో పెద్ద కంట్రాక్టరుగా పేరెన్నికగన్న టి. శే. నక్కనారాయణరెడ్డి దౌహిత్రి అనిత పరి ణయం జూన్ 27 తేది హైదరాబాదులో విశ్వకపల్లి ఫంక్షన్ హాలులో జరిగింది.

### భరద్వాజ కుమారుడు

రచయితగా ప్రఖ్యాతుడు, ఆకాశవాణి ద్వారా నిత్య పరిచితుడు, నిగర్వి నిరా డంబరులైన హైదరాబాదు మిత్రుడు శ్రీ రావూరి భరద్వాజ కుమారుడు గోపిచంద్; మచిలీపట్నం శ్రీ ఎస్. వీరభద్రరావు కుమార్తె సుశీల వివాహం గత 25 తేది బందరులో జరిగింది.

### మాధవరావు చెల్లెలు

రెండుకాళ్ళు ఒక చోట పెట్టి రెండు సెకనులుకూడా ఒకచోట వుండలేని పాద రసం వంటి చురుకైన కరుకైన రాకెట్ స్పీడైన యువకుడు, స్నేహపాత్రుడు, నెల్లూరు ఆంధ్రభూమి విలేఖరి శ్రీ వసంత మాధవరావు తన చెల్లెలు పద్మజకు, ఆర్. టి. సి. ఉద్యోగిగా రాజోలులో వున్న రామకృష్ణతో గత 25 తేది నెల్లూరు పాండురంగ అన్నదాన సమా జంలో వివాహం జరిపారు.

### మేదరమెట్ల పెండ్లి

రాపూరు తాలూకా గ్రిద్దలూరు వాసి శ్రీ పెనుబల్లి వీరరాఘవయ్య తమ్ముడు, రిటైర్డ్ టీచరు శ్రీ శంకరయ్య కుమారుడు, పామూరు స్టేట్‌బ్యాంకి ఉద్యోగి రమేష్ బి. కాం, శ్రీకాకుళంజిల్లా యర్రబాలెం శ్రీ పూసాల సీతారామయ్య కుమార్తె వెంకట సీతారత్నకుమారి కళ్యాణం గత 26 తేది మేదరమెట్ల లక్ష్మీవెంకటేశ్వర జిన్నింగ్‌మిల్లులో జరిగింది.

### బి. వి. ఎస్.

నెల్లూరు పారిశ్రామికుడు, బి. వి. ఎస్ ఫార్మస్యూటికల్స్ యజమాని శ్రీ బి. వెంకటనారాయణ కుమారుడు మదన మోహన్ బాబ్జీ; కలువాయి, శ్రీ సోమిశెట్టి మస్తానయ్య కుమార్తె మాధురి వివాహం 25 తేది నెల్లూరు ఇండస్ట్రియల్ ఎస్టేట్‌లో జరిగింది.

### ఇస్కపాళెం వివాహం

వెంకటాచలంసమితి అధ్యక్షత ను మూడుసార్లు అధిష్టించి, ఆస్తిని హారతి కర్పూరంలా ధారబోసుకొని, నిరాశా నిస్పృహలతో హఠాన్మరణానికి గురి యైన ఇస్కపాళెం- రామిరెడ్డి దశరథ రామిరెడ్డి తనయుడు విజయభాస్కరరెడ్డి; మైపాడు, శ్రీ కొట్టపల్లి కోదండరామిరెడ్డి తనయ భవాని వివాహం 26 తేది శ్రీ కస్తూరిదేవి విద్యాలయంలో జరిగింది.

### తాళ్ళపాళెం పెండ్లి

కావలి తాలూకా తాళ్ళపాళెం వాసి శ్రీ పుచ్చలపల్లి రామచంద్రారెడ్డి పుత్రిక నీత; విశాఖపట్టణం శ్రీ ఓబిలి సుబ్బరామి రెడ్డి పుత్రుడు రవి వివాహం 25 తేది నెల్లూరు శ్రీ కస్తూరిదేవి విద్యాలయంలో జరిగింది.

### రామయ్యపాళెం పెండ్లి

అందుకూరుపేట మండలం రామయ్య పాళెం వాసి శ్రీ తోటపల్లి రమణయ్య కుమారుడు శ్రీధర్ కుమార్; కొరుటూరు, శ్రీ పెదపవారు పట్టాభి రామయ్య కుమార్తె ఝాన్సి పరిణయం పెళ్ళకూరు అన సూయమ్మ కళ్యాణమండపంలో జరిగింది.

### చివుకుల వివాహం

సౌమ్యుడు, వివాదరహితుడైన నెల్లూరు న్యాయవాది శ్రీ చివుకుల నక్క నారాయణ కుమారుడు మాలకొండయ్య; బృందావనం- శ్రీ ఆగ్రా రాధాకృష్ణ మూర్తి కుమార్తె వెంకటసుబ్బు వసుం ధర వివాహం గత 25 తేది ఆంధ్రసభ లోని దుగ్గిశెట్టి సుబ్రహ్మణ్యం కళ్యాణ భవనంలో జరిగింది.

### ఇంజనీరు కుమార్తెలు

ఇర్రిగేషన్‌శాఖ ఎగ్జిక్యూటివ్ ఇంజ నీరు శ్రీ ఆర్. నారాయణరెడ్డి కుమార్తె లిద్దరికీ గత 18 తేది నెల్లూరు విజయ మహల్‌లో వివాహమహోత్సవాలు జరి గాయి.

పెద్దకుమార్తె రేణుక; కడపజిల్లా రాచగుడిపల్లివాసి శ్రీ డి. సి. ఓబులరెడ్డి కుమారుడు కోటేశ్వరరెడ్డితోను-

చిన్నమ్మాయి శారదను, నెల్లూరు- స్వర్గీయ గూడూరు కృష్ణారెడ్డి కుమా రుడు ఆంటే తన బావమరది రామశేషా రెడ్డితోను- పాణిగ్రహణాలు జరిగాయి.

### "సాధు పరిణయం"

నెల్లూరు బహుముఖ వ్యాపారవేత్త శ్రీ సాధు నరశింహారావు కుమార్తె శ్రీమరాలు (బి. కాం.); విజయవాడ, శ్రీ బూర్ల వెంకటరావు సోదరుడు శ్రీని వాసరావు (ఎం. కాం.) వివాహం గత 18 తేది మావాల బాలతిమ్మయ్య కళ్యాణమందిరంలో జరిగింది.

### పత్తివారి పెండ్లి

స్టోన్ హవుస్ పేట శ్రీ పత్తి శివ రామయ్య కుమారుడు సుబ్రహ్మణ్యం; కావలి, స్వర్గీయ వాకిచర్ల గురవయ్య కుమార్తె పార్వతి అనే దీప్తి పరిణయం గత 13 తేది కావలిలో జరిగింది. ★

---

## 1981 ఎన్నికలు

(2 పేజీ కొరవ)

కట్టించిన ఘనత ఈ సమయంలో జిల్లా మంత్రిగా వున్నాడు కాబట్టి నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డిగారికే దక్కుతుంది; పంచాయతీ మండలాలంటే ఒక మేజర్ పంచాయతీ అంతకూడా వుంటవు. అటు వంటి మండలాల పదవులను పూర్వం సమితి అధ్యక్షులుగా పనిచేసినవారు కాదు సరిగదా, కాస్త పేరుతెలిసినవాడెవడూ పోటీచేయడానికి ఇష్టపడడు. ఈ కమండ లాలకు తెలుగుదేశం విశ్వామిత్రసృష్టి తయారుకావలసిందే! సమితులు రద్దు కావడమేకాదు, పంచాయతీరాజ్య సంస్థ లకు అంజయ్య పార్టీరహితంగా ఎన్నికలు జరిపిస్తే, సరికొత్తగా వివేకా నందుని వేషంవేసుకొని అవతారపురు షుణ్ణని తనకుతాను చెప్పుకుంటున్న ముఖ్యమంత్రి ఎన్టీరామారావు పంచాయ తీలలో కూడా పార్టీ చిచ్చుపెడతాడట!

ఇక అది వదిలేద్దాము. 1981 లో జిల్లాలోని 15సమితులలో వెంకటాచలం, వెంకటగిరి హరిజనులకు; కోవూరు గిరి జనులకు రిజర్వుచేయబడి, పన్నెండు జనరల్‌గావుండినవి. ఆస్తుడు వివిధ సమితులకు ఎన్నికైనవారు.

సూళ్లూరుపేట - వేనాటి సుబ్బారెడ్డి, నాయుడుపేట- మల్లెమాల వెంకటరాఘవ రెడ్డి, కోట- నల్లపరెడ్డి చంద్రశేఖరరెడ్డి, గూడూరు - ఎల్లసిరి శ్రీనివాసులురెడ్డి, రాపూరు - సి. రాజశేఖరరెడ్డి, పొదల కూరు - కొమ్మి లక్ష్మయ్యనాయుడు, వెంకటగిరి-ఓరేపల్లి వెంకటసుబ్బయ్య, వెంకటాచలం - డాక్టర్ సిహెచ్. బాల చెన్నయ్య, ఇందుకూరుపేట- ఆనం భక్తవత్సలురెడ్డి, కోవూరు- ఎల్లసిరి మోహనరావు, బుచ్చి-సామంతు సుబ్బా రెడ్డి, కావలి-వేమిరెడ్డి అయ్యపరెడ్డి, వింజమూరు - కొన్నంగడ్డ రామానా యుడు, ఉదయగిరి-ఎం. వి. నారాయణ రెడ్డి, ఆత్మకూరు-గంగవరపు తిరుపతి నాయుడు.

వీటిలో కావలి అయ్యపరెడ్డి సురజా పంకరం ఉపాధ్యక్షుడు డి. వెంకారెడ్డి; వెంకటాచలంలో బాలచెన్నయ్య జి. వి. ఛైర్మన్ అయిన తర్వాత ఉపాధ్యక్షుడు ఐ. రామకృష్ణారెడ్డి, ఆయన శాసనసభ్యు లైన తర్వాత పి. వి. రత్నం; సూళ్లూరు పేటలో సుబ్బారెడ్డి మరణానంతరం ఉపాధ్యక్షుడుగా వుండిన ఆయన కుమా రుడు వేనాటి రామచంద్రారెడ్డి; కోటలో చంద్రశేఖరరెడ్డి ఎం. ఎల్. ఎ. అయిన తర్వాత ఉపాధ్యక్షుడు ఎద్దుల వేణు గోపాలరెడ్డి; వెంకటగిరిలో ఓరేపల్లి తర్వాత అల్లం ఈశ్వరయ్య అధ్యక్షులుగా వ్యవహరించారు.

వివరవ ఒక్కమాటచెప్పి ఈ సమి తుల పురాణం ముగిస్తాము! సమితి అధ్య క్షత ఖాళీ అయితే తె. దే. ప్రభుత్వం మళ్ళీ ఎన్నికతో ఆ పదవిని భర్తీచేసిన పాపానపోలేదు. రిజర్వుడు స్థానాలను కూడా ఉపాధ్యక్షులుగావున్న ఉన్నత కులాలవారే పరిపాలించారు! ★

---

## నెల్లూరు సంగతులు

(4 వ పేజీ కొరవ)

ఎ. బి. వి. పి. అభ్యర్థులేనట. అధ్య క్షుడుగా శ్రీ ఎ. ప్రతాప్‌రెడ్డి, ఉపాధ్య క్షుడుగా శ్రీ ఎ. ప్రభాకరరెడ్డి, కార్య దర్శిగా శ్రీ వై. రవీంద్ర ఎన్నికైనారు.

### సంపాదకుల సమావేశం

జిల్లాలోని చిన్నపత్రికల సంపాద కులు, ఇటీవల నెల్లూరులో సమావేశ మైనారు. నెల్లూరుకాలింగ్ ఎడిటర్ శ్రీ ఎం. డి. ఖలీలుద్దీన్ అధ్యక్షించారు. అన్నిపత్రికలకు ప్రభుత్వ అక్రిడిటేషన్ ఇవ్వాలని వీరు డిమాండ్‌చేశారు. ఇళ్ళ స్థలాలు కావాలని అడిగారు.

### మెటీరియల్సు సభ

ఇన్‌స్టిట్యూషన్ ఆఫ్ ఇంజనీర్స్ సంస్థ మొన్న శివ హాల్‌లో మెటీరి యల్స్ మేనేజిమెంట్ అనే అంశంపై ఒకసభ జరిపింది. రాష్ట్ర అకౌంటెంట్ జనరల్ డాక్టర్ జి. వి. చలపతిరావు మాట్లాడారు. ప్రతి వస్తువు తయారీలో 60 శాతం మెటీరియల్సుకే సరిపోతుంది కాబట్టి, ఇతర దేశాలలో వలె వాటిని నియమబద్ధంగా వాడితే ఉత్పత్తి ఖర్చు తగ్గి, ధరలు అదుపులోకి వస్తాయన్నా రాయన. ప్రస్తుతం రక్షణ దళాలు ఈ విషయంలో శాస్త్రీయంగా వ్యవహరిస్తు న్నాయని. అన్ని రంగాలు ఇదే అల వరుచుకోవాలని కోరారు

తెలుగు గంగ, కడప సూపరింటెం డింగ్ ఇంజనీర్ శ్రీ కె. సి. ఎస్. రెడ్డి సభ నధ్యక్షించారు; సంస్థ కార్యదర్శి శ్రీ బి. మల్లికార్జున వందనాలుచెప్పారు.

---

# శివారెడ్డి పద్యాలు

### వేషాలు, మోసాలు

వేషాల్తో మోసాల్తో
రాశిపోయదు కెవ్వి ఓట్లు లాభమాయా!
చేసేదిచెయ్యి ఎక్కువ
అశవనికారు ఎక్కువైతే చేరు?

సర్వసంగ పరిత్యాగి కాంతిరాత
ఆ నరేంద్రుండు స్వామిజీ ఆరునేడ
నక్కలావేడ స్వర్గమ్ము నాకమేడ?
ఎన్టిరామన్న! నీవేడ యెకరేడ!

సినిమాల్లో చలనచిత్రాల్లో వేషాలు
అవసరమ్ము రంగులంతవర కె
వనికిరావు రాజ్యపాలనో రామన్న!
ఆలోచించు తప్పటడుగువెయకు!

ఓడజారకొయ్య వగలాలి హేళను
యేవగింపు ఏదో ఎగసికమ్ము
నవులపాలుగాకు వట్టింటకడలోకు
పున్న దేదొజెప్ప పులికిపడకు!

---

## పంచాంగం

### పుష్యమికార్తె

19-7-1986 వ తేది శనివారం వేరుసజామున 5 05గంటలకు పుష్యమి కార్తె ప్రవేశం, సువృష్టి.

### జూలై తిథులు

| | | | |
|---|---|---|---|
| 19 | శని త్రయోదశి | రా 9-09 | గం. వ. |
| 20 | ఆది చతుర్దశి | సా 6-43 | ,, |
| 21 | సోమ పూర్ణిమ | సా 4-26 | ,, |
| 22 | మంగళ బహుళ పాడ్యమి | వ 2-24 | ,, |
| 23 | బుధ విదియ | వ 12-26 | ,, |
| 24 | గురు తదియ | వ 11-24 | ,, |
| 25 | శుక్ర చవితి | వ 10-21 | ,, |

—నిమ్మగడ్డ వేంకటేశ్వరశాస్త్రి

---



---

# సినిమాలో మారు వేషాలకు ఎన్టీఆర్ కాస్ట్యూమ్స్ బెస్ట్

షూటింగ్ స్పాట్‌లకు కొన్ని చిన్న పత్రికలను తీసుకొస్తుంటారు కంపెనీ వాళ్ళు. 11వ తేది ఉదయం ప్రసాద్ స్టూడియోలో ఒకచిత్రం షూటింగ్ జరుగుతూంటే, అక్కడికి వచ్చింది ఒక చిన్న పత్రిక. అందులో రాష్ట్ర ముఖ్యమంత్రి ఎన్.టి. రామారావు వివేకానందునిలా ఉడుపులు ధరించి ఉన్న ఫోటో చూసి ఒక సుప్రసిద్ధ హీరో "ఈ డ్రెస్సెదో తమాషాగా ఉందే! ఈ చిత్రంలో నేను మారువేషంలో వచ్చేసీనుకు ఇలాంటి దుస్తులు తయారుచేసి ఉంచండి. రామారావుని నేను ఎద్దేవాచేసినందుకు ప్రజలు విరగబడి నవ్వి ఎంతైనా మెచ్చుకుంటారు!" అన్నారు.

అక్కడేవున్న డైరెక్టరు "మరి రేపు మన ముఖ్యమంత్రిగారు యోగి వేమన రూపంలో దర్శనమిచ్చారనుకోండి. మీరూ అలాంటిడ్రెస్సే కావాలని అడుగుతారా" అన్నారు నవ్వుతూ.

"అడిగితే మీకు కాస్ట్యూమ్స్ ఖర్చు చాలా తగ్గుతుందిగా?" అన్నారు హీరో. దాంతో అక్కడున్న హీరోయినూ,అందరూ గొల్లున నవ్వుకున్నారు.

రామారావుగారి వేష భాషలగురించి మాట్లాడుకుని నవ్వుకోవడం ఇటీవల కొన్ని షూటింగ్‌లలో పరిపాటి అయిపోయింది.

మా మద్రాసు సినీ ప్రతినిధి

ఎవ్వరేవిధంగా అనుకుని నవ్వుకున్నా నిరంకుశుడు ఏమాత్రం పట్టించుకోడన్నది అందరూ ఎరిగిన సత్యమే.

ఒక సినిమానటుడు ముఖ్యమంత్రి అయ్యాక ఇలాంటి విడ్డూరాలు జరగడంలో ఒకింతయోక్తి ఏమీలేదు.

కాని, ఇలాంటి వేషాలవల్ల ప్రజలలో తన అంతస్తు పెరుగుతుందా లేక దిగజారిపోతుందా అనేవిషయం గురించి ఆలోచించుకోవాలాయన.

ప్రతిదీ ఆలోచించుకొని చేస్తే తప్పటడుగులు తప్పుతాయికదా?

ఇలా తరచు వేషాలు వేయడంవల్ల తమ కడుపులు కొడుతున్నట్లో, లేక తమ వృత్తిని కించపరుస్తున్నట్లోనని రేపు ఏ పగటివేషగాళ్లో రిట్ పిటిషన్ వేసినా ఆశ్చర్యమేమీలేదు.

### యాభై వేలు గల్లంతు!

హీరో కృష్ణ సంస్థ పద్మాలయా ఫిలిమ్స్ కార్యాలయంలో జూన్ 9న యాభైవేల రూపాయలు అదృశ్యమయ్యాయి. ఔట్‌డోర్ షూటింగ్ ఖర్చుల నిమిత్తం బాంక్ నుంచి లక్ష రూపాయలు విత్‌డ్రా చేసి తీసుకొచ్చి, యాభైవేలను లొకేషన్‌కు పంపించి, మిగతా యాభైవేలను అలమారులో ఉంచి తాళంవేశారట. ఆ తర్వాత ఆ డబ్బు మాయమైందట. వెంటనే పోలీస్ రిపోర్ట్ ఇవ్వడం జరిగిందట. దర్యాప్తు జరుగుతోంది.

# తండ్రీ కొడుకులతో ఒకేతార డ్యూయెట్లు

ఇటీవల హిందీ నటి డింపిల్ కపాడియాను తన చిత్రంలో నటించమని ఒక నిర్మాత అడిగారు. కథను ఆమెకు వినిపించారు. చాలా చక్కనిపాత్రే, పారితోషికం ఎంత ఎక్కువ అడిగినా ఇస్తానన్నారు.

సినిమావార్తలు

"చాలాచక్కనికథ మహిళల సానుభూతి చూరగొనేపాత్రనాది. నాకు మంచి పేరొచ్చి తీరుతుంది. మీది పెద్ద సంస్థ, మీ డైరెక్టర్‌కూడా పేరుమోసిన వ్యక్తే. అయినా, ఈ చిత్రంలో నటించలేను. క్షమించాలి," అంది డింపిల్.

నిర్మాత నిర్ఘాంతపోయాడు. "కారణమేమిటో తెలుసుకోవచ్చా?" అనిఅడిగాడు

"మీ చిత్రంలో ధర్మేంద్రగారు హీరో, ఆయన కొడుకు సన్నీడియోల్, నేనూ ప్రేమించుకున్నాం, అలాంటప్పుడు ధర్మేంద్రగారి పక్కన ప్రియురాలిగా ఎలానటించగలను?" అంది.

అప్పుడానిర్మాత కళ్ళెదుట డింపిల్ ఒక సినిమానటిగాకాక, ఆదర్శవంతమైన భారతనారిగా కనిపించిందట. "మీరు చెప్పిన పాయింట్ కరెక్టే!" అంటూ ఇంకోనటిని బుక్‌చేసుకున్నాడు.

ఇప్పుడీవిషయం ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే, విజయనిర్మల దర్శకత్వంలో కీర్తి అనే తార "పరశురాముడు" వగైరా నాలుగైదు చిత్రాలలో విజయనిర్మల భర్త, హీరో కృష్ణ పక్కన నటిస్తోంది. "పగసాధిస్తా" చిత్రంలో ఆమె కొడుకు నరేష్ పక్కన నటిస్తోంది. తండ్రీ కొడుకులిద్దరితోనూ డ్యూయెట్లు, ఆలింగనాలు, రొమాన్సులు.... ఇవన్నీ విజయనిర్మల దర్శకత్వంలోనే!

పాపము శమించుగాక!

—కొరవ 11వ పేజీలో





## కనులవిందు
# కర్పూరదీపం

చిత్ర సమీక్ష

నేడు తెలుగు చిత్రపరిశ్రమలో గుర్తింపు, ప్రజాదరణా వున్న దర్శకులలో రాజాచంద్ర ఒకరు. ఆయన ప్రత్యేకత, అశ్లీలాలకు తావులేకుండా వినోదభరితంగా, విసుగులేకుండా చిత్రాలను రూపొందించడంలో దిట్ట ఆయన. ఆయన చిత్రాలన్నీ ఎక్కువగా మంచి కుటుంబ కథతో, కుటుంబ సమేతంగా చూడ తగినవిగా వుండటం విశేషం. అందుకే ఆయన దర్శకత్వంలో చాల చిత్రాలు విజయవంతమైనాయి. ఆయన తాజా చిత్రం 'కర్పూరదీపం' కూడా అటువంటిదే!

మానస, కిశోర్‌లు బావామరదళ్ళు. వారిరువురు గాఢంగా ప్రేమించుకుంటారు. ఒకరంటే మరొకరికిప్రాణం. వారి పెళ్ళికి పెద్దలుకూడా ఒప్పుకొంటారు; కాని, హఠాత్తుగా కిషోర్ తండ్రి మరణించడంతో పెళ్ళి వాయిదా పడుతుంది. కిషోర్ అమెరికావెళ్తాడు. తదాంత మానసకు మోహన్‌తో పరిచయమౌతుంది.

—కొరవ 11 పేజీలో



'పరశురాముడు'లో కృష్ణ, కీర్తి

# తెలుగు తారలలోనూ ఎయిడ్స్ భయం!

"ఇదేవిటి బాబోయ్, ఒక చీరను వాష్ చేయడానికి వదిరూపాయలా?" అని నెత్తిబాదుకున్నారు ఒకనిర్మాత ఇటీవల. ఆయన చిత్రంలోని హీరోయిన్ షూటింగ్ అయిపోయిన కాస్ట్యూమ్స్‌తోనే ఇంటికి వెళ్ళిపోయి మర్నాడు ఆ కాస్ట్యూమ్స్‌తోనేవస్తూ వాషింగ్ చార్జీ వసూలు చేస్తూందట "ఆ వాషింగేదో నేనేచేయిస్తానమ్మా. దయచేసి కాస్ట్యూమ్స్‌ను ఇక్కడే వదలివెళ్ళు?" అని ఆ నిర్మాత ఎంతగా కోరినా ఆమె వినక "ఇక్కడే వదిలేసి వెళ్తాననుకోండి. నా షూటింగ్ లేనప్పుడు మీరదేచీరను ఏ ఎక్‌స్ట్రానటిచేతనో ధరింపచేస్తారు. ఆ తర్వాత మళ్ళీ నేను ధరించననుకోండి. ఎయిడ్స్‌లాంటి అంటువ్యాధి నాకు సోకితే నానంగతేంకాను?" అన్నదట.

మొత్తంమీద ఎయిడ్స్‌వ్యాధికి ఇచ్చిన ప్రచారం మూలంగా చాలామంది భయపడిపోతున్నారు.

ఎయిడ్స్‌పై పరిశోధనలు ఇటుపైన జరుగుతాయని మద్రాసులోని అపోలో హాస్పిటల్ ఛైర్మన్ డాక్టర్ ప్రతాపరెడ్డి తెలియజేశారు. ఈ పరిశోధనలనిమిత్తం నిధిసేకరణకు సుప్రసిద్ధ హాలీవుడ్‌తార ఎలిజబెత్ టేలర్ నాయకత్వంలో ఒకబృందం అక్టోబరునెలలో మనదేశంలో పర్యటించనున్నది.

ప్రముఖ హాలీవుడ్ సినీనటుడు రాక్ హడ్సన్ ఎయిడ్స్ వ్యాధితో మృతిచెందాడు అతను మృత్యువుతో పోరాడు

—కొరవ 11వ పేజీలో

## ప్రకటన

మా పెద్ద కుమారుడు (20 సం. వయస్సు) మామిడేల రవికుమార్ అను వాడు మా స్వాధీనములో లేకుండా 10, 11 మాసములుగా ఇంటికి రావడముకూడా మానుకొని, దుర్జనులతోపై కొన్ని చోట్ల దాటివేయుటయు సిరికి సైకిల్స్ మొదలగు వస్తువుల దొంగతనం చేయు టకు అలవాటుపడినట్లు మాకు తెలిసినది. కనుక అతనుచేయు బాకీలకుగాని, దొంగ తనాలకుగాని మాకు యేలాంటి సంబంధము లేదు.

ఇట్లు,
మామిడేల సుధాకరశర్మ
14-7-86

## బుచ్చిరెడ్డిపాళెం కో-ఆపరేటివ్ రూరల్ బ్యాంక్ లిమిటెడ్
బుచ్చిరెడ్డిపాళెం - నెల్లూరుజిల్లా

## వేలం ప్రకటన

క్రింది పేర్లుగల స్థిరాస్తులను వాటి రాబట్టుకొనుటకుగాను 1986 సం. జులై 30 తేది ఉ 11గం కు బుచ్చిరెడ్డిపాళెం కో-ఆపరేటివ్ రూరల్‌బ్యాంక్ ఆఫీసు బుచ్చిరెడ్డిపాళెంలో వేలము వేయుదురు. షరతులు ఆఫీసుకో తెలుసుకొనవచ్చును

1. కంచర్ల రంగయ్యచౌదరి, S/o. సుబ్బానాయుడు, వవ్వేరు.
స. నం. 1168/3, విస్తీర్ణం 1-39
" 1168/4, " 1-38
2. కనుపూరు జయమ్మ, W/o. పెంచలరెడ్డి, రేబాల.

| ప. నం. | స. నం. | విస్తీర్ణం |
|---|---|---|
| 129 | 299 | 2-00 |
| 2 | 899 | 0-98 |

3. తిక్కవరపు వెంకటసుబ్బారెడ్డి, S/o. వీరారెడ్డి, యల్లాయపాళెం.

| ప. నం. | స. నం. | విస్తీర్ణం |
|---|---|---|
| 198 | 370/బి | 2-09 |
| | 373/ఎ | 0-26 |
| | 374/2 | 0-20 |

4. గువపాటి హరిశ్చంద్రారెడ్డి, S/o. సుబ్బరామిరెడ్డి, యల్లాయపాళెం,
ప. నెం 694/1 విస్తీర్ణం: 1-50
5. వల్లూరెడ్డి పిచ్చిరెడ్డి, S/o. శేషారెడ్డి, తురిమెర్ల.
ప. వ. 154, 20, 24, 208, 1. విస్తీర్ణం: 9-82.

-సెక్రెటరీ

## ప్రకటన

ఇందుమూలముగా యావన్మందికి తెలియజేయడమేమనగా నెల్లూరు మూలాపేట వాస్తవ్యులు స్వర్గీయ అన్నమేటి శ్రీనివాసులు S/o. రామయ్యగారి ఆస్తి జాయింటు కుటుంబమునుండి అభివృద్ధి కాబడినది. సదరు ఆస్తులలో అన్నమేటి రామయ్యగారి కుమారుడు అన్నమేటి వెంకటరమణయ్య,రిటైర్డుఎక్సైజ్ సర్కిల్ ఇన్‌స్పెక్టర్ అయిన నాకు స్వర్గీయ శ్రీనివాసులుతో సరిసమానమైనభాగమున్నది. సదరు శ్రీనివాసులు వారసులకు సగ భాగము మాత్రమే హక్కుగలదు. ఇందుకు విరుద్ధముగా ఎవరైనా లావాదేవీలు జరిపినా, అన్యాక్రాంతములు జరిపినా నా హక్కులకు భంగము కలుగదని: నేను తీసుకొనబడు చర్యలకు బాధ్యులగుదురని తెలియచేయటమైనది.

గూడూరు ఇట్లు,
16-7-86 ఎ. వి. రమణయ్య,

# ముఖ్యమంత్రి

(1వ పేజీ తరువాయి)

ప్రత్యర్థులతో పోల్చుకుంటే తన ప్రతిష్టను తగ్గించుకున్నట్లు. వేషం మార్చగానే తాను మహా పురుషుడుగా మారిపోయినట్లు ప్రవర్తించారాయన. చూసేవారికే ఎబ్బెట్టుగా వుండింది ఆ దృశ్యం.

ఆయన రాకకోసం అధికారులు ఎన్ని ఏర్పాట్లుచేశారో? ఎన్నిగంటలు వేచి వున్నారో లెక్కలేదు. హెలిపాడ్ తదితర నిర్మాణాలైతే, మూడురాత్రులు మూడు పగళ్లు నిద్రాహారాలులేకుండా తయారుచేశారు. ఏంప్రయోజనం? శంకుస్థాపన రాళ్ళకు కట్టినగుడ్డను లాగడానికి కూడా ఎన్టీఆర్‌కు ఓపిక లేకపోయింది. అక్కడ పొలాలలో బాలికలను నీట్‌గా ముస్తాబుచేయించి, గంటలతరబడి ఎండలో నిలబెట్టారు. అక్కడాయన భవనానికి రిబ్బను కత్తిరించవలసివుంది. అయితే వారివైపు ముఖంకూడా చూడలేదు. పాపం,ఎండలో సొమ్మసిల్లి పడిపోయేట్లు నిలబడిన చిన్న చిన్న ఆ పిల్లలు నిరుత్సాహంతో వెనుదిరగవలసివచ్చింది.

పట్టుపురాళ్ళతో సహపంక్తి భోజనా లన్నారు 50, 60 మంది మత్స్యకారులను విస్తళ్ళముందు నిలబెట్టారు. అన్నగారి దర్శనం, పంచభక్ష్యాలతో భోజనం రెండూ ఒకేసారి దొరుకుతాయన్న సంబరంతో ఓపికతో కాచుకొనివున్నారు వారు పాపం; కానీ అన్నగారికి హెలికాప్టర్ లోకి వేడివేడి బ్రాయిలర్ చికెన్ కూరతో ఖరీదైన క్యారియర్లు సరఫరాఅయ్యాయి; వీరికి ఇంటిముఖం, దోవకూడా రెండూ దేజారిపోయాయి!

వేలు ఖర్చుపెట్టి రెండెకరాల విశాల ఆవరణంలో వివిధ ప్రభుత్వ శాఖలు ఏర్పాటు చేసిన ప్రదర్శన శాలల గతి కూడా అంతే! విహంగవీక్షణంతో, రెండు క్షణాలలో చుట్టేశారు వాటిని. ఆయన వక్రమంగా వచ్చింది, జరిపించింది ఒక్క బహిరంగసభనే! అక్కడకూడా ఉపన్యాసాలలో కొత్తదనమేమీలేదు. పాపం దినపత్రికా విలేఖరులకు వ్రాసుకోవడానికి ఒక్క వాక్యంకూడా దొరకలేదు.

అన్నగారికి లఘుశంక అవసరం వస్తుందేమోననే భయంతో ముత్తుకూరు ఇన్‌స్పెక్షన్ బంగళాను భూతల స్వర్గంలా అలంకరించారు. బాత్‌రూమ్‌లో పాలరాళ్లు పరచి, రాత్రికిరాత్రి ఓవర్‌హెడ్ ట్యాంకు కట్టి, కొళాయిలు బిగించి,కాస్టలీ రకాలవు తరుపులు పరిచి నందమూరి స్వాములవారికి వసతింపుసేవకు సర్వం సిద్ధంచేశారు కానీ ఆయనాతట్టు ముఖం చూడలేదు ఈ రిపేర్లకే అరలకారంపైన ఎగిరిపోయిందట.

ముఖ్యమంత్రికి తనపార్టీ ఎమ్మెల్యేలెవరో, ప్రతిపక్షాలవారెవరోకూడా తెలియదు. కె. వి. సుబ్బారెడ్డి, రాజమోహన రెడ్డి, జక్కా వెంకయ్యలు తెలుగుదేశం సూత్రాలకు కట్టుబడి, తనకు అండదండలుగా వుండడంపట్ల అపరిమితమైన హర్షం వ్యక్తం చేశారాయన. బహిరంగసభలో! క్రింద కూర్చున్న జనానికి నవ్వాలో, ఏడవాలో అర్థంకాలేదు.

ముఖ్యమంత్రి వచ్చి చేసిపోయిన మంచిపని- ఇందుకూరు పేట రైతులగోడు ఓపికగావిని, న్యాయంచేయమని జాయింట్ కలెక్టర్‌ను ఆదేశించి పోవడం. స్మశాన స్థలంలోని గిరిజనులకు వేరే స్థలాలు చూపించి, రైతులపై పెట్టిన కేసులు రద్దుచేయించమని చెప్పారు. జాయింట్ కలెక్టర్ శ్రీ దయాచారి చేసిన స్వాగత ఏర్పాట్లను ప్రశంసించారు.

ఎన్టీఆర్‌కు శ్రీ దయాచారి, ఎస్. పి. శ్రీ ఆర్. ఆర్. గిరీష్‌కుమార్‌లతో పాటు, రెవిన్యూమంత్రి శ్రీ నల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డిగారుకూడా స్వాగతం చెప్పారు. ఎమ్మెల్యేలు శ్రీ ఈదూరు రామకృష్ణారెడ్డి, బల్లి దుర్గాప్రసాద్,మస్తెయ్య, మాజీ ఎమ్మెల్సీ శ్రీ ఎం. గంగాధరం తదితరులు పాదాభివందనాలు చేశారు. రామనారాయణరెడ్డి మాత్రం బెట్టుగా నమస్కారంతో సరిపెట్టుకున్నాడు!

ఈ సందర్భంగా ఆయన దాదాపు 3 కోట్ల విలువైన అప్పులు, వెనుకబడిన తరగతులవారికి పంచిపెట్టారు. ఇందులో నెల్లూరు కెనరాబ్యాంకువారే, ఆరుగురికి ఖరీదైన నిస్సాన్ మినీలారీలు అప్పుగా రాదారు.

• • •

వెంకటగిరిసభలో అధికారులు, నాయకులు లేరు. రాజాలు అంతా తామై జరిపించారు. ముత్తుకూరువలె పెద్దగా జనాకర్షణకూడా లేదట. ★

## మేము-మీరు

(3వ పేజీ తరువాయి)

'ప్రొఫెషనల్ ఆర్గనైజేషన్' మాత్రమే! రుజువురూపేణా అటువంటివారిని నిర్ధారిస్తే, మా సంస్థనుంచి బహిష్కరిస్తాం. అయితే ప్రజలే స్పందించి, అటువంటి వారికి గుణపాఠం నేర్పగల్గితే మేమూ హర్షిస్తాం.

--డాక్టర్ పూండ్ల శ్రీనివాసులురెడ్డి
నెల్లూరు, కార్యదర్శి
ఇండియన్ మెడికల్ అసోసియేషన్

## జనవాణి

(3వ పేజీ తరువాయి)

పూర్ణాక్యాంటీన్ ఎదురువీధిలో త్రాగి ఇంటిముందు రెండేసి బంకులున్నాయి. ఇవి దాదాపు ప్రతిశూదలిలో ఇళ్ళ ముందు ప్రత్యక్షమవుతున్నాయి. వీటి చుట్టూ సిగరెట్లు త్రాగుతూ గంటల తరబడి నానాకానీ కొట్టేవాళ్ళ, తగాదాలు తీర్చుకొనేవాళ్ళు ఎక్కువ. వాళ్ళ బూతుమాటలను వినలేము. వీటికితోడు సైకిల్‌షాపులు బంకులు ప్రక్కన్నే వెలుస్తున్నాయి. ఇళ్ళకు అడ్డంగా సైకిళ్ళ, రిక్షాలు రిపేరు చేస్తుంటారు. వీటినుండి ప్రజలకు విముక్తిలేదా? వీటికి విద్యుత్ కనెక్షనుకూడ ఇచ్చారు. మున్సిపల్ అధికారులు ఇకనైనా వీటి విషయంలో తగు చర్య తీసుకోవాలి.

నెల్లూరు --ఒక పౌరుడు

## టౌనుబస్సులా? మృత్యుశకటాలా?

నెల్లూరులో టౌనుబస్సుల జోరు రోజురోజుకు మితిమీరిపోతుంది. బ్రేక్ ఇన్‌స్పెక్టర్ వీటికి ఎలా సర్టిఫికెట్లు ఇస్తున్నారో తెలియదు.

సీట్లు సరిగ్గా ఉండవు. లైట్లుండవు. పరదాలుండవు. కిటికీలు పెద్ద శబ్దం. ఆ శబ్దం యుద్ధ సమయంలో కూడా ఉండదు. వాటి పరుగులుచూచి జనం భయభ్రాంతులవుతుంటారు. దానికితోడు ఓవర్ టేకులు రోడ్డుమీద జనం తప్పినా వాళ్ళను సరవాలేదు. బస్సులో పంద మందికి పైగా ఎక్కిస్తారు. ఈమేరకు రాలు తనిపేందుకు వీలుండదు. ఒక మగ ప్రేరం వుండదు. అల్లరి మూకల తోపుడు.

ఈ ఆగడాలు అరికట్టాలంటే ఎస్.పి. గారు జోక్యంచేసుకొని ఒకవారంరోజులు ఆదేశనిగా చెక్‌చేసి, నకాలంలో బస్సులు బయలుదేరేటట్లుచేస్తే అటు ప్రజలకు ఇటు ట్రాఫిక్‌కు అంతరాయం వుండదు.

నెల్లూరు -పోలూరు దేవమణి. ★

## మునిసిపాలిటీ

(5వ పేజీ తరువాయి)

రోడ్ల ధందాలం వర్ణించడానికి మాటలు చాలవు. అసమర్థులు అవినీతిపరులైన అధికారులను శిక్షించే అధికారం ఈ దేశంలో పౌరులకే వుంటే, నెల్లూరు మునిసిపాలిటీలో ప్రతి అధికారి శిక్షాపాత్రుడే అవుతాడు. గుంటలలో కట్టుకు మట్టి కప్పనుకూడా స్తోమతలేని లీకరికంలో వున్నట్లుంది పురపాలక సంస్థ రోడ్డుండేది రాకపోకలకనే ధ్యాసమే అధికారులకు వున్నట్లులేదు. తిప్పరాజువారి వీధి, దండువారి వీధి కలిసే కూడలిలో జమీన్ రైతు కార్యాలయం దగ్గరగా మునిసిపల్ సిబ్బంది ఏదో తనిఖీచేస్తున్నారు దానికోసం తోలిన కంకర, గులక, ఇసుక సరిగ్గా రోడ్డు మధ్యలో పరిచారు. మూడురోజులనుంచి రోడ్డు-బ్లాక్ అయిపోయింది. ఇంజనీరుకూడా వచ్చిపోయినట్లున్నారు. కానీ ఆపరోడ్డుకు అడ్డం వున్నాయన్న స్పృహ ఆయనకు కల్గలేదు. బాధ్యత కలిగిన ఇంజనీర్ల తీరలే ఇలావున్నప్పుడు, వారి పరిపాలన ఇంకెంత సుందర ముదనష్టంగా వుంటుందో చెప్పాలా?

పరిపాలన ఎంత అధ్వాన్నమైనా, కాంట్రాక్టర్లు వారిబిల్లుల విషయంలో మాత్రం పనులు సుకరంగా జరిగిపోతున్నట్లున్నాయి. ఎంతవరకు నిజమోగాని, బిల్లులవిషయంలో పెద్దకుంభకోణమే జరుగుతున్నదని అలజడిగావుంది. బరువుపడిన బిల్లులే ఉన్నతాధికారుల టేబిళ్ళమీదనుంచి కదలికకు నోచుకుంటున్నాయని, బరువు మరీ బరువుగావుంటే చేయనిపనులనుకూడా బిల్లులు పుట్టుకొస్తున్నాయని అలజడిగావుంది, అధికారులు ఈ కార్యక్రమం 'బిజీ'లోపడి, పౌరులను వారి సమస్యలను మర్చిపోతున్నారేమో, పాపం.

కమిషనరుగారు నెల్లూరుకు కొత్తగా వచ్చారు. ఆయన ఇంకా కుదుటపడినట్లు కూడాలేదు. అప్పుడే పరిపాలన ఇంత అస్తవ్యస్తంకావడం, అదుపుతప్పిపోవడం మంచిదికాదు. పరిస్థితి ఇట్లే కొనసాగితే అలజడిరేగుతుంది. ★



శ్రీ లక్ష్మీ నృసింహాయనమః

**శ్రీ వేదగిరి లక్ష్మీనృసింహస్వామివారి దేవస్థానం**

నరసింహులుకొండ - నెల్లూరు మండలము - నెల్లూరుజిల్లా

## వేలం ప్రకటన

నెల్లూరుజిల్లా, నెల్లూరు మండలము నరసింహులుకొండపై వేంచేసియున్న శ్రీ వేదగిరి లక్ష్మీనృసింహస్వామివారి దేవస్థానము హక్కు అనుభవముగల ఈక్రింది తెలుపబడిన పాట్లు 15-8-86నుండి14-8-91వరకు (అనగా 5 సం.లు) లీజుకు పాటను 25-7-86 తేదిసా. 4 గం. ల. వేలం వేయబడును.

పాటు నెం. 1: కంకరమట్టి త్రవ్వి తీసుకొనివెళ్లు లారీలకు రుసుము వసూలుహక్కు వేలము.

పాటు నెం. 2: గ్రానైటు క్వారీలీజు బహిరంగ వేలముపాట: పై దేవస్థానమువద్ద ఎండోమెంటు డిపార్టుమెంటు అధికారుల సమక్షమున 25-7-86 తేది సా. 4 గం,కు వేలంపాట జరుగును. పాటలో పాల్గొనదలచినవారు రు. 1000/- రొఖము ధరావతుచెల్లించి మరియు వారిస్వంత అదుమానము లేనటువంటి యాభైవేల రూపాయలుగల ఆస్తుల వివరములు తెలుపు నట్టి మండల రెవిన్యూ ఆఫీసరువద్దతెచ్చిన సర్టిఫికేటు వేలంపాటకు ముందుగా దాఖలు చేసుకొనవలయును. పాటతెగినవెంటనే హెచ్చుపాటదారుడు ధరావత్తు తోకలిసి పాటలో సగము మొత్తం వెంటనే చెల్లించుచూ 7రోజుల లోపలదాఖలు చేసుకున్న M.R.O. ఇచ్చిన ఆస్తి సర్టిఫికేటుమీద ఏలాంటి అదుమానము లేనటువంటి E. C. తెచ్చి దాఖలుచేయవలెను. పాట ఖాయపరచినట్లు ఉత్తర్వులువచ్చి తెలియచేసినపిదప వారంరోజులలోగా పాటమొత్తములో మిగతా సగంపైకము చెల్లించుచూ 5 సం.లు లీజుమొత్తమునకు సరియగు బాదర బందిలేని ఆస్తిసెక్యూరిటీ యిచ్చి కౌలు రిజిష్టరు చేసుకొనవలయును. మిగతా వివరములు షరతులు దేవస్థానము కార్యాలయములో తెలుసుకొనవలయును.

కార్యనిర్వహణాధికారి,




## ప్రపంచ స్థాయికి చెందిన టెల్కోవారి కొత్త సాంకేతిక విజ్ఞానం సమర్పిస్తోంది
## భారతీయ పరిస్థితులకోసం మార్చబడినదిగాక ప్రత్యేకంగా సృష్టించ బడిన వాహానాన్ని

**టాటా 407 : తేడా అయిన డిజైన్** ఈ వాహనాన్ని డిజైన్ చేసేముందు లారీ సర్వీస్ నడిపేవారిని ప్రశ్నించాం— వారు వాహనంలో కోరుకునేది ఏమిటని? ఆపైన మూలసిద్ధాంతంపై కృషి ప్రారంభించాం. భారతదేశంలో వాహనాలను నడిపే తీరు, ఖాతాదార్ల అవసరాలు, రోడ్ల స్థితిగతులను గురించి రాబట్టగల విస్తృతమైన వివరాలన్నింటినీ పునాదిగా చేసుకొని మా కంప్యూటర్‌పై 407 ను డిజైన్ చేశాం.

ఇలాంటివాటిని కూర్చి, కర్కశమైన పరీక్షలకు గురిచేశాం. ఆపైన ప్రారంభదశనుండి మెరిసిపోయే దశవరకు మా కర్మాగారాలలో నిర్మాణాన్ని సాగించాం. చూడండి, ఇదే అది. మీరు కావాలని కోరుకున్నది టాటా 407. మీ మనసులను పూర్తిగా దోచేసిది,

**సాటిలేని సెమి సెమి-ఫార్వర్డ్ డిజైన్** మిగిలిన వాహనాలలో మీరు ఎదురయ్యే సమస్యలకు పరిష్కారంగా ఇంజన్‌ను మామూలుగాగాక ముందుగా అమర్చాం ఫలితం నిర్వహణ సులభం. మరింత రక్షణతోపాటు నడిపేవారికి హాయి.

**నడపడంలో మరింత హాయి** నడిపేవారి క్యాబిన్‌లో వేడి, చప్పుడు, కంపనం తగ్గేందుకుగాను ఇంజన్ కొద్దిగా వెలుపలగా అమర్చబడింది. ప్రవేశానికి నిడివైన తలుపులు, లోపల మరింత విశాలం, డ్రైవరుకి వీలుగా అమర్చుకోగల సీట్, నడిపేవారికి అలుపు సొలుపూ తక్కువయ్యేలా అమర్చబడిన కంట్రోల్స్, విస్తృతమైన విండ్‌స్క్రీన్, చుట్టుప్రక్కలంతా అస్పష్టంగా కనిపించేలా డ్రైవర్‌యొక్క కిటికీలు, పైనుంచి కిందవరకూ హాయిగా గాలితగిలేందుకు వీలుగా అమర్చుకోగల ప్రెష్ ఎయిర్ లోవర్స్

**నిర్వాహణ సులభం** సెమి సెమి-ఫార్వర్డ్ డిజైన్‌వలన ఇంజన్‌పైగల మూత కారులాగానే తెరుచుకుంటుంది గనుక డ్రైవర్లకు ఇంజన్‌ను సులభంగా, నేరుగా చేరే వీలు. దీనివలన సులభమయ్యే రోజువారీ నిర్వహణ పనులు: 1) ఇంజన్ ఆయిల్ 2) రేడియేటర్‌లో నీళ్ళు 3) విండ్ స్క్రీన్ వాషింగ్ ఫ్లూయిడ్ 4) బ్రేకింగ్ ఫ్లూయిడ్ వీటన్నిటినీ సరిచూసి నింపుకోవడం మరియు ఫ్యాన్‌బెల్ట్ బిగించుకోవడం వంటివి.

**టాటా 407 పనితనం : శక్తి అతి ఎక్కువ, ఫ్యూయల్ ఖర్చు అతి తక్కువ** టెల్కో సంప్రదాయానికి తగినట్టుగా, టాటా 4-సిలిండర్ డైరెక్ట్ ఇంజక్షన్ ఇంజన్‌కి 3200 ఆర్.పి.ఎమ్.లో 55 హెచ్.పి.ని రూపొందించే అత్యధికమైన శక్తి బరువుల నిష్పత్తి వుంది. దీనికి అమర్చబడినవి డ్రై-టైప్ సిలెండర్ లైనర్లుమీసంబరి తక్కువ ఫ్యూయల్ ఖర్చుతోపాటు ఉన్నమైన పనితనాన్ని ఇచ్చేందుకుగాను జతకూర్చబడిన ట్రాన్స్‌మిషన్ మరియు ఏక్సిల్ రేషోలు. డబుల్ డిక్లచింగ్ తొలగించేందుకుగాను దృఢమైన 5-స్పీడ్ సింక్రోమెష్ గియర్ బాక్స్ నడపడంలో హాయికోసం హైడ్రాలిక్లి ఆపరేటెడ్ డయాఫ్రేమ్ క్లచ్ తిప్పేందుకున్న పరిధి తక్కువయినందువలన 407 వాహనాన్ని ఎంతో సులభంగా త్రిప్పివేయవచ్చు. పగయరాలలోని ఇరుకు సందులలోనూ

**టాటా దృఢత్వం : రోడ్డు ఎలావున్నా లోడ్‌ని ఎత్తేందుకు రెడీ**

407 జీవాన్ని, విశ్వసనీయత పెంచే విశిష్టతలు యింకా వున్నాయి. ప్రెస్ట్ స్టీల్ "సి" ఫ్రేమ్‌పై ప్లాట్‌డెక్ ఎక్కించబడింది. క్యాబ్ మరియు హుడ్ యొక్క బాడీ మరింత దృఢంగా నిర్మించబడింది. ముందు, వెనుక ఏక్సిల్స్‌పై హైడ్రాలిక్ డబుల్-యాక్టింగ్ షాక్ ఎబ్జార్బర్లతో కూడిన దృఢమైన సెమీ-ఎలిప్టికల్ లీఫ్ స్ప్రింగులతో సస్పెన్షన్, ఆ ఫలితంగా రోడ్డు ఎలావున్నా, లోడ్ ఎంతయినా హాయిగానడిచే వీలు.

**ఎక్కువలో ఎక్కువ రక్షణ-డ్రైవర్‌కూ, ప్రజలకు :** రక్షణకూ, నిర్వహణకూ సులభంగా వుండేలా బ్రేకింగ్ సిస్టమ్ డిజైన్ చేయబడింది. ముందు వెనుక ద్వయో-సెర్వోడ్రమ్ బ్రేక్‌లతోను. వీల్‌పై ఒక హాండ్-బ్రేక్‌తోనూ కూడి వ్యాక్యూమ్ ఎసిస్టెడ్ టాండెమ్ మాస్టర్ సిలెండర్‌తో హైడ్రాలిక్ పద్ధతిలో ఆపరేట్ చేయబడుతుంది. నడవడాన్ని అందరికి సురక్షితం చేసేందుకుగాను దీనికి ఎసిమెట్రికల్ హెడ్ ల్యాంప్స్ ఉన్నాయి. ఈ విశిష్టతలన్నింటితోపాటు ముందుగల యాంటీ-రోల్ బార్ టాటా 407 వాహనాన్ని సురక్షితమైన వాహనంగా చేస్తుంది

**ఎన్నిక చేసుకునేలా వీల్ బేస్‌లు :** 3100 మిల్లీమీటర్ల స్టాండర్డ్ వీల్-బేస్ మరియు 2750 మి. మీ.ల వీల్‌బేస్ ఈ రెండింటినుంచి మీరు దేన్నయినా ఎంచుకోవచ్చు. "లోడ్ బాడీ" మరియు ఫ్యాక్టరీలోనే నిర్మించబడిన "క్యాబ్" తోసంపూర్ణ స్థితిలో ట్రక్ లభిస్తుంది. బస్‌లు, వ్యాన్‌లకోసం బాడీ వివరణాలు, సీటింగ్ తరహాల పథకాలను మేము సమకూర్చగలం, ఆ ఫలితముగా మీ పనికి, ఆ పని ఏదయినాసరే, ఖచ్చితంగా బాడీ నిర్మించుకోవచ్చు - డెలివరీవ్యాన్, పిక్-అప్ లేక సైడున్ వ్యాగన్, ఎంబ్యులెన్స్, యుటిలిటి వ్యాన్ లేక మినీబస్. పోలీస్ లేక పోస్టల్ వ్యాన్, క్యాష్ వ్యాన్ లేక అలా మీ సొంతానికి వ్యాన్ అయినా రూపొందించుకొనేందుకు.

**భారతదేశపు విస్తృతమైన సేవ, విడిబాగాల సౌకర్యం.**

**టాటా 407 : 100%స్వదేశపుతయారీ చిరకాలంనిలిచే నిర్మాణం**

**వివరాలకు మమ్మల్ని సంప్రదించండి.**

## బుకింగ్ జరుగుచున్నది.

## టెల్కో: ప్రావీణ్యతకు మరోపేరు

డీలర్లు : సేల్స్ అండ్ సర్వీస్

## యం. జి. బ్రదర్స్, నెల్లూరు

కర్నూలు రోడ్డు-ఒంగోలు ఫోన్ : 3186 దర్గామిట్ట నెల్లూరు ఫోన్ : 4976, 6413 నాయుడు బిల్డింగ్స్ చిత్తూరు ఫోన్ : 2686

సంపాదకుడు. ముద్రాపకుడు. [illegible] ప్రెస్ 17/170 [illegible] -524001